# ఆంధ్రశాస్త్రప్రాంభవిద్య

సంపుటము 39] ఏలూరు, 15 జనవరి '51 [సంచిక 1














ప్రకాశకులు:
రామా అండ్ కో., (H.O.) ఏలూరు.
బ్రాంచెస్: గుంటూరు, రాజమండ్రి, భీమవరం, తెనాలి, విజయనగరం.

# విషయసూచిక

సం॥ చందా రు 1-0-0 (పోస్టేజితో సహా) Regd. M. N. 3766.

# ఆంధ్ర రాష్ట్ర ప్రారంభ విద్య

# Andhra Rastra Prarambha Vidya

## విద్యావిషయిక మాసపత్రిక


| సంపుటము 39 | ఏలూరు, 15 జనవరి 1951. | సంచిక 10 |
| --- | --- | --- |


## నిత్య సంకీర్తనము

**వివరణము :**

నీచదృష్టితోఁ జూచిన సత్యము గోచరముకాదు. ఉన్నతభావములున్నచో నొకవిధమగు గంభీరతయుండును. జీవితమును నీచభావములతోఁ గడుపువాడు పతితుఁడగును. ఉన్నతభావపూరితుడ వగుము. అట్లు సలుపుచో నీ జీవితము ఫలవంతమగును. జలము ప్రవహించుచున్నచో నిర్మలముగా నుండును. అటులే ఉన్నతభావద్వారమును దెఱచియుంచుచో నూతనోత్తేజము లభించుచుండును.

**సంకీర్తనము :**

హే విశ్వప్రకాశ ! విజ్ఞానలేశమును ప్రసాదింపుము.
నీ కాంతిచేతనే సర్వమును ప్రకాశించుచున్నది.
నీ వెలుగే సర్వమును గనుపట్టజేయుచున్నది.
నీ విజ్ఞాన తరంగములలో నోలలాడు యోగ్యతను నాకుఁ బ్రసాదింపుము.

—స్వామి రామతీర్థ.

# సంక్రాంతి

రచన : నిమ్మన లింగరాజు
పాతబాడి-టిటాఘర్.

1, వచ్చిందోయ్ వచ్చింది
తెనుగుజనాళికి సంక్రాంతి
దేశబాంధవుల విశ్రాంతి
సోదరిప్రేమకు చేమంతి
వన్నెలదేరే వాసంతి
విద్యాబుద్ధుల వర్ధంతి
ప్రణయము గ్రోలిపే పూబంతి
సర్వశుభోదయమహా కాంతి
2. తెచ్చిందోయ్ తెచ్చింది
సంధ్యాలంకృత దీపాలు
వాకిటచక్కని మేళాలు
మిలమిలమెరిసే మినుముట్లు
గాయకులంతా గానాలు
సతీపతుల సంతోషాలు
గృహములకెల్ల వికాసాలు
తెనుగుతల్లికి జేజేలు
3. ఇచ్చిందోయ్ ఇచ్చింది
ఆటపాటలకు ఆనందం
క్రొత్తదుస్తులు మాకందం
అనురాగమునే సేవింతుం
కల్మషప్రేమను తొలగింతుం
నిర్మలప్రేమను నిర్మింతుం
స్వేచ్ఛాపదముల జీవింతుం
జీకటిబాధలు క్షీణింతుం
పండుగులే పరమానందం




# మేలుకొలుపు

రచన : నిమ్మన తింగరాజు - పాతబాడి - టిటాఘుర్.

1. మేలుకొనరా ఆంధ్రవీరా !
మేలుకొనరా ఆంధ్రశూరా !
మేలుకొనరా మేరుధీరా !
మేలుకొనవయ్యా ? వడిగా మేలుకొనరా ! మే॥

2. అమితవైభవ తేజమలరే
ఆంధ్రమాతకు ప్రియము గొలిపే
ఆంధ్రభాషా జాతిగౌరవ
మందగావలెరా ! వడిగా మేలుకొనరా ? మే॥

3. మాతృగర్భమునందు పుట్టి
మర్మముల మటుమాయ జేసి
ఉన్నతాభ్యాసంబునకు చే
యూతనీయుమురా ! వడిగా మేలుకొనరా ॥ మే॥

4. జ్ఞానసంపద లెల్ల బడసి
మానవాభ్యుదయుంబు చాటి
పేరుమోసిన వీరజ్యోతివి
నీవుగావలెరా ! వడిగా మేలుకొనరా ! మే॥

5: బ్రహ్మపట్టపురాణి పలుకు
తేటవెన్నెలబోలు వెలుగు
తెలుగు బాలుర హృదయములలో
వెలుగజేయుమురా ! వడిగా మేలుకొనరా ? మే॥

6, మద్యపాన నిషేధమేగా
మంచిమార్గము తెనుగుజాతికి
విద్యపానా సక్తియేగా
విమలశోభితమూ_వడిగా మేలుకొనరా ! మే॥

7. స్వాగతము జై ఆంధ్రమాతా !
స్వాగతము జై సుగుణపూతా !
స్వాగతము సుస్వాగతమ్మని
స్మరణచేయుమురా ! వడిగా మేలుకొనరా ! మే॥

# సర్దార్ వల్లభభాయ్ పటేలు



సిరిపురపు
వేంకట సుబ్బారావు.

వల్లభభాయ్ పటేలు క్రీ. శ. 1875 వ సంవత్సరం అక్టోబరు 31 వ తేదీనాడు గుజరాతులోని "కమరసద్" గ్రామంలో ఒక సాధారణ రైతు కుటుంబములో జన్మించాడు. ఈయన తండ్రి పేరు ఝవేర్ భాయ్ పటేలు. వీరు లవకుశల సంతానమని ప్రసిద్ధిచెందిన కురమీజాతికి చెందినవారు. తండ్రి ఝవేర్ భాయ్ ఒక సాధారణ రైతు. కాని దేశ భక్తుడు. 1857లో జరిగిన సిపాయిల తిరుగుబాటులో ఆయన పీష్వాల సైన్యములోచేరి పనిచేశాడు. అందు ఆయన అఖండ పరాక్రమముతో పోరాడాడు.

వల్లభభాయి పటేలు తన ప్రారంభవిద్యను స్వగ్రామమునందే అభ్యసించినాడు. తరువాత తనగ్రామమునకు సమీపముననున్న నడియాడునందలి ఉన్నత పాఠశాలలో విద్య నభ్యసించినాడు. ఈయనయందు అహింసాత్మక సత్యాగ్రహ బీజములు విద్యార్థి దశలోనే నాటుకొనినట్లు చెప్పవచ్చును. నడియాడులో ఈయన చదువుకొనుచున్న రోజులలో విద్యార్థులకవసరమైన అన్నివస్తువులు పాఠశాలయందలి స్టోర్సులోనే కొనవలెననెడి నియమముండెడిది, ఉపాధ్యాయులు విద్యార్థులచే బలవంతముగా అన్ని వస్తువులను అధిక వెలలకు కొనిపించెడివారు. పటేలు విద్యార్థులనందర నొకత్రాటి బంధించి వస్తువులను స్కూలు స్టోర్సులో కొనకుండునట్లు అహింసాత్మక సత్యాగ్రహాన్ని సాధించి అందు విజయమును పొందినాడు. ఈయన నడియాడులోనే మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. ఆర్థికపరిస్థితులచే అంతకంటెఉన్నత విద్య నభ్యసించలేకపోయినాడు. తరువాత ముఖ్తారీ పరీక్షను చదివి అందులోకూడ ఉత్తీర్ణుడైనాడు.

వల్లభభాయి న్యాయవాదిగా గోధ్రాలోపనిచేయ ప్రారంభించాడు. ఈయన చక్కని వాక్పటిమ కలవాడు. అందువలన కొద్దికాలములోనే యీయన న్యాయవాదవృత్తిలో పేరుప్రతిష్ఠలను సంపాదించినాడు.ఈయనగంభీరస్వభావముకలవాడు. గోద్రాలో ప్లేగు వ్యాప్తి చెందుటతోడనే ఈయన భార్యను స్వగ్రామమైన కమరసడ్ కు పంపివేసి తాను నడియాడులో న్యాయవాదవృత్తి నడుప ప్రారంభించాడు. కాని ప్లేగువల్లనే భార్యమరణించింది. భార్య మృత్యువార్త ఈయనకు న్యాయస్థానములో ఒక కేసు నడుపుచున్న సమయములో తెలిసింది. అయినను ఈయన యేమాత్రము చలించక ఆ కేసును పూర్తిగా నడిపియే యిల్లు చేరాడు.

వల్లభభాయి పటేలు ఒక కంపెనీవారి సహాయముతో బారిష్టరీ చదువుటకు నిశ్చయించుకున్నాడు. ఆ కంపెనీవారినుండి వచ్చిన ఒక ఉత్తరము సోదరుడైన విఠల్‌భాయ్‌కిచిక్కుటవలన విఠల్ భాయి తాను మొదట లండను వెళ్ళి వచ్చుటకు ఉద్దేశిస్తాడు. వల్లభభాయ్ అందు కంగీకరిస్తాడు. అటుతరువాత మూడు సంవత్సరములకు వల్లభభాయ్ బారిష్టరీ చదువుటకు లండను వెళ్ళాడు, బారిష్టరీ పరీక్షలో ఈయన సర్వప్రథముడుగా ఉత్తీర్ణుడైనాడు, విద్యానంతరము యీాయన యూరపుఖండ పర్యటనము చేసి యింటికి చేరాడు.

వల్లభభాయ్ బారిష్టరైనతరువాత అహమ్మదాబాదులో న్యాయవాద వృత్తిని ప్రారంభించాడు, అన్నగారయిన విఠల్‌భాయ్ బొంబాయిలో న్యాయవాదిగా పనిచేయసాగాడు. వల్లభభాయ్ న్యాయవాదిగా పేరుప్రతిష్ఠలు, ధనముగూడ సంపాదించినాడు. విఠల్‌భాయ్ లోకసేవచేయు నభిలాష కలవాడు. ప్రథమమున సంసారిక స్థితిగతులు అయన కట్టి అవకాశమును యియ్యలేదు. తరువాత వల్లభభాయ్ ధన సంపాదన అన్నగారి చిరవాంఛిత లోకసేవకు తోడ్పడినది.

1915 లో గాంధీగారు దక్షిణాఫ్రికానుండి తిరిగి వచ్చిన తరువాత దేశ స్వాతంత్ర్యముకొరకు ప్రయత్నము చేయసాగారు. ఆయన ప్రముఖ న్యాయవాదులతో సంప్రతించి వారు తన పనిలో తోడు పడునట్లు చేసుకొనుట కొరకు అహమ్మదాబాదు వచ్చాడు. వల్లభభాయ్ పటేలు గాంధీని ప్రప్రథమంగా యిచ్చటనే కలుసుకొన్నాడు. అప్పటివరకు వల్లభభాయ్ పాశ్చాత్యసభ్యత కలవాటు పడినవాడు కనుక గాంధీని పరిహసించాడు.

పటేలుయొక్క రాజకీయ జీవితము గోధ్రా సమావేశముతో ప్రారంభమయింది. ఆ రోజులలో గుజరాతులోని అనేక ప్రాంతాలలో సామాన్య రైతులచే 'వెట్టిచాకిరి' చేయించుకునే అచారము ఉండేది. ఆ పద్ధతిని మాన్పించుటకు యేర్పడిన సంఘమునకు వల్లభభాయ్ పటేలు మంత్రిగా నియమించబడుతాడు. పటేలు కమీషనరుకు 'వెట్టిచాకిరి' పద్ధతి చట్టవిరుద్ధమనీ దానిని వెంటనే రద్దు చేయించవలసినదనీ కోరుతూ తంతివార్తపంపుతాడు. కమీషనరు అందుల కంగీకరించి ఆ యాచారాన్ని మాన్పించాడు. తరువాత యీాయన 1917 లో జరిగిన ఖేడా సత్యాగ్రహములో పూర్తిగాపాల్గొన్నాడు. బీహారు రాష్ట్రంలోని మోతిహారి ప్రాంతములో పంటలు పండక పన్నులు యివ్వలేకపోయినందువలన రైతులకు, యూరోపియను జమీందారులకు పోరాటము సంభవిస్తుంది. వల్లభభాయ్ అక్కడి రైతులకొరకు వారి తరపున నాయకుడుగా పనిచేస్తాడు. సత్యాగ్రహ ఫలితంగా నిర్ధన రైతులు పన్నులు కట్టకుండుటకు అనుమతించ బడుతారు.

1920 లో జరిగిన కలకత్తా సమావేశములో కాంగ్రెసు సహాయనిరాకరణఉద్యమాన్ని నిశ్చయించింది. ఇదే సమయములో మోతీలాలు నెహ్రూ, రాజేంద్రప్రసాద్, రాజగోపాలాచారి, దేశబంధు దాసు మొదలగు ప్రముఖ న్యాయవాదులతోపాటు వల్లభభాయ్ పటేలుకూడ న్యాయవాద వృత్తికి రాజీనామా యిచ్చినాడు. అప్పటినుండి పూర్తిగా దేశసేవలో నిమగ్నుడైనాడు. గాంధిజీ జైలునకు వెళ్లినపిమ్మట అహింసాత్మక సహాయనిరాకరణోద్యమమును నడుపు భారమును పటేలు నిర్వహించాడు.

1923 లో నాగపూరులోని ప్రభుత్వము కాంగ్రెసు యొక్క త్రివర్ణపతాకమును నిషేధించుచూ ఉత్తర్వుల నిచ్చింది. ఆ ఉత్తర్వుల నెదిరించుచూ సత్యాగ్రహం నడుపబడింది. వల్లభభాయ్ ఆ సత్యాగ్రహాన్ని పట్టుదలతో కార్యదీక్షతో నడిపాడు. విజయమును సాధించాడు. గవర్నరు పటేలును పిలిపించుకొని త్రివర్ణ పతాకముతో ఊరేగింపు జరుపుకొనుటకు అనుజ్ఞ యిచ్చాడు,

బార్డోలీ ప్రాంతములోని రైతులకు ప్రభుత్వంలోని ఆంగ్లేయ ఉద్యోగులు పోలీసులచేతనే బందిపోటు దొంగతనాలు చేయిస్తూ బాధ కలిగించసాగారు. రక్షణ నెపముతో కొంతమంది పోలీసులనా ప్రాంతములో నుంచి వారి ఖర్చులకై ప్రభుత్వం ప్రజలపై 40వేల రూపాయల జుల్మానా విధించింది. వల్లభభాయ్ పటేలు ఆ ప్రాంతమందలి గ్రామములలో పర్యటనముచేసి రైతుల నందర నైక్యపరచి పన్నుల నియ్య నిరాకరించునట్లు చేసినాడు. గత్యంతరము లేక ప్రభుత్వము వారి పన్నులను తీసివేసింది. మరుచటి సంవత్సరము ప్రభుత్వము రు 100 కి 25 చొప్పున పన్నుల నెక్కువచేసింది. తిరిగి పటేలు పన్ను నిరాకరణఉద్యమాన్ని ఆరంభించాడు. గ్రామములలో సంచరించి రైతుల నందర సంఘటితపరచి ఉద్యమమును తీవ్రముగా నడిపాడు. చాలామంది జైళ్లకు పంపబడ్డారు. ఆస్తులు వేలము వేయబడినవి. కాని పటేలు చలించలేదు. ఆసమయములో పటేలు అన్నగారయిన విఠల్‌భాయ్ పటేలు కేంద్ర శాసన సభా ప్రతినిధిగా పనిచేయుచుండెను. ఆయన వైశ్రా

యికి బార్డోలీ విషయములలో జోక్యము కలిగించుకొని న్యాయము కలిగింపని పక్షములో రాజీనామా నిచ్చెదనని ఉత్తరము వ్రాసాడు. అందు మీదట ప్రభుత్వము ఒక సంఘమును యేర్పాటుచేయగా ఆ విచారణ సంఘము రు 100 కి రు 6-8-0 చొప్పున పన్ను వృద్ధి చేయవలసినదని యిరుపక్షములకు అనుకూలంగా తీర్మానించింది. యీ విధంగా బార్డోలీ సత్యాగ్రహ విజయమునకు వల్లభభాయ్ పటేలు యొక్క నిరంతర కార్యదీక్షయే కారణమని చెప్పవచ్చు; యిదే సందర్భములో గాంధీజీ యీయనకు "సర్దార్" అను బిరుదు యిచ్చినాడు. నాటినుండి యీయన సర్దార్ పటేలు అని ప్రసిద్ధిచెందినాడు.

1929 లో లాహోరులో పండిత జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతను కాంగ్రెసు సమావేశమైంది. ఆ సమావేశములో స్వరాజ్యప్రతిపాదన ఆమోదించబడింది. 1930లో ఉప్పుసత్యాగ్రహము ప్రారంభించబడింది. గాంధీజీతోపాటు వల్లభభాయి పటేలు అందులో పాల్గొన్నాడు. పోలీసువారు పటేలును అరెస్టుచేసి, 3 మాసములు జైలు శిక్షను విధించారు. చివరకు గాంధీ ఇర్విన్‌ప్రభువునకు జరిగిన ఒడంబడిక ప్రకారము ఉప్పుసత్యాగ్రహము ముగించబడింది.

1931 లో జరిగిన కరాచీ కాంగ్రెసుసమావేశమునకు వల్లభభాయి పటేలు అధ్యక్షుడైనాడు. పటేలు ప్రజలకు సత్య అహింసలతో కూడిన మార్గము ననుసరించవలసినదని ఉద్బోధించినాడు. గాంధీజీ రౌండు టేబిలు సమావేశమునకు లండను వెళ్ళగానే కాంగ్రెసు కార్యభారమును తన భుజములపై వేసుకొని, నడిపించాడు. రౌండుటేబిలు సమావేశము విఫలమైంది. ప్రభుత్వమువారు కాంగ్రెసును చట్ట విరుద్ధమని ప్రకటించి, కాంగ్రెసునాయకుల నందరిని జైళ్ళకు పంపింది. సత్యాగ్రహమును ఆపివేసిన తరువాత నాయకులు జైళ్ళనుండి విడుదలచేయబడ్డారు. సర్దార్ పటేలునుమాత్రము విడుదల చేయలేదు. 1934 లో ప్రభుత్వమువారు పటేలును అనారోగ్య కారణముపైన విడుదల చేసారు.

1935 లో యిండియాప్రభుత్వ చట్టప్రకారము 8 రాష్ట్రములలో కాంగ్రెసు మంత్రివర్గములు స్థాపించబడినవి. సర్దార్ వల్లభభాయ్ పటేలు నాయకత్వమునసే కాంగ్రెసు మంత్రివర్గములు నిర్మించబడినవి. పటేలు అప్రతిహతప్రతిభతో యీ మంత్రివర్గముల నన్నిటిని ఒకే మార్గమున నడిపాడు.

1939 లో రెండవ ప్రపంచమహాసంగ్రామము ఆరంభమైంది. దేశస్వాతంత్ర్యముకొరకు గాంధీజీ నాయకత్వమున వ్యక్తిగత సత్యాగ్రహోద్యమము ఆరంభమైంది. కాంగ్రెసు మంత్రివర్గములు అప్పటికి రాజీనామా యిచ్చివేసినవి. సర్దార్ పటేలుకూడా జైలుకు వెళ్ళవలసివచ్చింది.

1942 లో కాంగ్రెసు తన అంతిమ ఉద్యమాన్ని ఆరంభించింది. ఆ సమావేశము బొంబాయిలో జరిగింది. ఆ సమావేశములో 'క్విట్ ఇండియా' తీర్మానము చే య బ డి ం ది. వెంటనే కాంగ్రెసు నాయకులందరు జైళ్ళకు పంపబడ్డారు. పటేలు అహమ్మదునగర కోటలో బంధించబడ్డాడు.

1945 లో శ్రీ భూలాభాయ్‌దేశాయ్ ప్రయత్నముల ఫలితంగా కాంగ్రెసు నాయకులు విడుదల చేయబడినారు. వైస్రాయి వేవెల్ సిమ్లాలో విభిన్న రాజకీయసంస్థల ప్రతినిధులతో సంప్రదింపులు జరిపాడు. ముస్లింలీగు కలిసిరానందువల్ల సిమ్లా సంభాషణలు ఫలించలేదు.

1946 లో యింగ్లండులోని లేబర్ ప్రభుత్వము వారు హిందూదేశ సమస్యా పరిష్కారము నిమిత్తం ముగ్గురు మంత్రుల సంఘమును పంపారు. వారు ప్రతిపాదించిన విషయములను కాంగ్రెసువారు ఒప్పుకొన్నారు. ఫలితంగా నడుమంత్రపు ప్రభుత్వము నిర్మించబడినది. ముస్లింలీగువారు మొదట పాల్గొనక పోయినను, తరువాత పాల్గొన్నారు. యీ ప్రభుత్వములో సర్దార్ వల్లభభాయ్ పటేలు స్వదేశ వ్యవహారముల మంత్రిగా చేయబడినాడు. పండిత నెహ్రూ ప్రధాన మంత్రిగా నియమించబడినాడు. 1947 సం. జూన్ 3 వ తారీఖున వైస్రాయి మౌంటు బాటెన్ ఒక ప్రకటనచేశాడు. ఆ ప్రకటనప్రకారము 'ఇండియన్ యూనియన్, పాకిస్థాన్' అను రెండు ఖండములుగా విభజించబడినవి. ఇండియను యూనియను ప్ర భు త్వ ము లో వల్లభభాయి పటేలుకు 'హోం' శాఖ, "స్వదేశసంస్థానముల" శాఖ యివ్వబడినవి.

బ్రిటిషుప్రభుత్వము దేశమునుండి వెళ్లుతూ, స్వదేశసంస్థానముల నన్నిటిని స్వతంత్రము చేసి వెళ్లింది. కాని సర్దార్‌పటేలు తన ప్రతిభ, చాకచక్యములతో ఒక్కొక్కటి చొప్పున, స్వదేశ సంస్థానములను భారతదేశ ప్రభుత్వములో కలిపి వేశాడు. చిన్నచిన్న సంస్థానములను యూనియనుగా

పరిణమింపచేశాడు. కొన్ని సంస్థానములను ఆయా ప్రాంతీయప్రభుత్వములలో కలియునట్లు చేశాడు. యీవిధంగా హిందూదేశములోని దాదాపు 600 స్వదేశసంస్థానములను, ఆయా సంస్థానాధీశ్వరులతో అచ్చట ప్రజలతో సంప్రదింపులు జరిపి భారతదేశ ప్రభుత్వములో లీనమగునట్లు చేసినాడు.

తన స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనుటకు పాకిస్థానుప్రభుత్వముతో కలసి కుతంత్రములు చేయుచున్న హైదరాబాదు సంస్థానముపై పోలీసుచర్యల తీసుకొని దానినిగూడా యిండియనుయూనియనులో చేర్చినాడు.

సర్దార్ వల్లభభాయిపటేలు యీవిధంగా గాంధీజీకి కుడిభుజంగా పనిచేశాడు. ఆయన సిద్ధాంతములను అనుక్షణము అనుసరించుచూ వానిని ఆచరణలోనికి తీసుకొనివచ్చుటకు పాటుపడ్డాడు. సాంప్రదాయకసంస్థలను, కమ్యూనిష్టుల అమానుషచర్యలను ఖండించుచూ వానిని యెప్పటికప్పుడుతలెత్తకుండా అణచివేస్తూవచ్చాడు. ఆయన కార్యదీక్ష, కార్యదక్షత యెంతయు ప్రశంసాపాత్రము లనుటకు సందేహము లేదు. ఈ మహానాయకుడు 1950 వ సంవత్సరము డిశంబరు 14 వ తేదీతో తన భౌతిక శరీరాన్ని వదలివేసి శాశ్వతయశఃకాయమును పొందినాడు. భగవంతుడు ఈ మహానాయకుని ఆత్మకు శాంతినొసంగుగాక!

---

## * * * పటేలు * * *

రచన శాంతిశ్రీ

బాపుజీ శిష్యుడు స్వాతంత్ర్య సేనాని, బార్డోలి సర్దారు వల్లభాయి
విశ్వాని కందని విషమ సమస్యల, తేల్చి చెప్పెడు మహాధీవిశాలి
విశ్వభీకరమైన పిడుగులు పైబడు, చున్నను వణకని ఉక్కుమనిషి
శాంతి సంస్థాప నాచార్యపీఠి రహించు, భారతదేశ ఉపప్రధాని
కార్యశూరుడు భారత శౌర్యరాశి
ధీరగంభీర వీరవిహారమూర్తి
మంచి అవసరమ్మున అస్తమించినాడు
మాతకడుపులో తీరని మంటపెట్టి.
విశ్వమంతయు నెంతయో భీతిజెంద
యుద్ధమేఘాలు ధణధణ ఉరుముచుండ
శాంతి మోచనల్ చేసెడి సమయమందు
మోచనాగ్రణీ భువిమీద ఒరిగినావ!
భరత కాంగ్రెసు స్వాతంత్ర్య భవనమునకు
ఒక్క స్తంభంబవై కూలితో పటేలు
బాపుజీ హత్యతదుపరి భరత ప్రజకు
మంచిదెబ్బయ్యె నీఅస్తమయముచేత!
వీరవరులను మేలైన ధీరవరుల
నరులు ప్రేమించు నిజమైన నాయకులను
సుఖము తమ్ముల కర్పించు సోదరులను
మృత్యుదేవత ముందు మోహించునేమి?

---

# మాయమై పోయావా?

జుఝువరపు వెంకటేశ్వరరావు—కొమరవోలు.

స్వాతంత్ర్య జ్యోతివీ!
స్వాతి ముత్యానివీ
స్వాతంత్ర్య రథ
సారథివై వెలసిన మా
వజ్రముష్టి సర్దార్
వల్లభాయి పటేల్ జీ!
    మాయమై పోయావా?
    కాయమే వదలావా?
బాపు పోయాడన్న బాష్పాలు
భారతమాత నేత్రాలనుండి
నేల రాలకమునుపే నీవు
కాలములో కలసావా?
    మాయమై పోయావా?
    మాలోన యిక లేవా?
సూర్యచంద్రుల వలె
పటేల్ నెహ్రూలు
భారత జాతికే
కార్యశూరులని
దేశవాసు లందరు
ఆశలతో నుండ
    మాయమై పోయావా?
    మాలోకి యిక రావా?
హిందు దేశములో ఆరు
వందల సంస్థానాల
మందుకైన లేకుండ
మటి యేకముగ జేసి
    భువి వదలి పోయావా?
    దివి కేగి పోయావా?
'ఉక్కుమనిషి' యని
ఒక్కుమ్మడిగా ప్రజలు
మక్కువతో నీపై
లెక్కలేని భారాలు మోప
'గుజరాతు సింహ' మని
ప్రజలలో బిరుదొంది
బాపుతోడను కూడ
బిరుదు 'సర్దారని' పొంది
    మాయమై పోయావా?
    కాయమే వదలావా?
దుండగులపై తన
చండశాసన మొనర్చి
ప్రచండ వీరుడవై
ప్రఖ్యాతిచెంది నేడు
    కన్ను మూసావా?
    మిన్ను కేగావా?
పొటేలువంటి మన
పటేలు నెహ్రూజి
భరతమాతకు రెండు
కరములని తలచిన
అఖిలభారతీయుల
అశ్రుసాగరమున ముంచి
    మాయమై పోయావా?
    మాలోన యిక లేవా?
ఉపప్రధానివై నీవు
అపారఖ్యాతి గడించి
బంధుమిత్రు లందర
అంధకారమున ముంచి
లోకమంతా నేడు
శోకనిలయము జేసి
మణిమాల నుండి
కోలికి రాలినట్లు
    మాయమై పోయావా?
    కాయమే చాలించావా?

## బాధితోపాధ్యాయుల నిధికి విజ్ఞప్తి.

సోదరులారా !

ఒకపరిమితి గలిగిన విద్య వచ్చిందనో, లేక విద్యాబోధనలో ప్రవీణుడనో, ఒకనికి సర్టిఫికేటు యిస్తున్నారు. ఆ లాంటి సర్టిఫికేటును నడవడి చెడ్డదనో, విధ్వంసక చర్యలలో పాల్గొన్నాడనో, బాధ్యతలో అశ్రద్ధగా నున్నాడనో, 154 M. E. R క్రింద తిరిగి రద్దుచేస్తున్నారు. యిది చాలా ప్రమాదకరమైన విషయం. యీ శిక్ష వలన అతనికి మరొకపని చేతగానందువల్ల, చేతనైన యీపనిని చెయ్యనీయనందువల్ల, పోషణబాధ్యత ప్రభుత్వం తీసుకోనందువల్ల, బ్రతికివుండి తను తినడానికి ఆలుబిడ్డల పోషించటానికి, దారిలేక ప్రతినిత్యం కుమిలి కుమిలి బాధలతో చనిపోవాలి. యిది వురిశిక్షకన్నా ప్రమాదకరమైన శిక్ష.

యీ విధమైన మారణాయుధాన్ని చేతిలో వుంచుకొని ఉపాధ్యాయుల వాణిని, స్వాతంత్ర్యాన్ని, అరికట్టి, అష్టకష్టాలపాలు చేస్తున్నారు. ఉపాధ్యాయుడు తప్పుచేసినంతమాత్రాన అతనికి వచ్చిన విద్య లేక విద్యాబోధనలోగల ప్రావీణ్యము, ఎలా తగ్గిపోతుందో అర్ధంకాదు. తప్పులు చేసినందుకు వేరే శిక్షాశాసనాలుండగా యీ శాసనాన్ని అమలుజరిపి జీవితాన్ని నాశనం చేయవలసిన అవసరంలేదు. ఎందువలన తప్పుదిద్దుకొని తిరిగి తన ప్రవీణతను ప్రదర్శించేందుకు అవకాశం లేదు. యిది నూతన రాజ్యాంగచట్టానికి కూడ పూర్తి విరుద్ధం. అయినా యీనాడు మలబారులో కొన్నివందల సర్టిఫికేట్లు, ఆంధ్రలో 45 సర్టిఫికేట్లు, విచారణ లేకుండా రద్దుచేసి వారికుటుంబాలను నానా యిక్కట్లుపాలుచేశారు. రెండు సంవత్సరాల కాలంగడుస్తున్నా వాటిని గురించి విచారించనేలేదు.

యిక రెండవది 416 జి. ఒ. ఉపాధ్యాయులను తాలూకా వరకే వేరు వేరు మ్యానేజిమెంట్లు క్రింద నున్నవారు ప్రత్యేక సంఘాలను నియమించుకోవాలని శాసిస్తుంది. మరొక విధమైన సంఘాల్లో చేరకూడదని నిషేధిస్తుంది. అంటే ఉపాధ్యాయ లోకమంతా ఐక్యంగా తాలూకా, జిల్లా, రాష్ట్ర సంఘాలు నిర్మించుకొని వారిసాధక బాధకాలు చర్చించుకొని, ప్రభుత్వానికి నివేదించుకొనే అవకాశాలు కూడా లేవన్నమాట. యీ జి. ఒ. ననుసరించి ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచర్సు ఫెడరేషన్ లో సభ్యులుగా చేరరాదని విద్యాశాఖాధికార్లు, జిల్లాబోర్డు అధికార్లు, తాఖీదులు జారీచేస్తున్నారు. కృష్ణాజిల్లా ఉపాధ్యాయ సంఘ కార్యదర్శి శ్రీ డి. వెంకట్రామయ్యగారిని, కడపజిల్లా ఉపాధ్యాయ సంఘ అధ్యక్షుడు శ్రీ జి. సి. వెంకటరెడ్డి గారిని, ఉద్యోగాలనుండి తొలగించారు. నెల్లూరు జిల్లాలో 21 మంది కార్యకర్తలకు జిల్లాబోర్డు నోటీసులు జారీచేసి జిల్లా ఉపాధ్యాయ సంఘంనుండి రాజీనామా ఇప్పించింది. అంటే ఉపాధ్యాయలోకం ప్రభుత్వం ఎదుటకు తమ సాధకబాధ

కాలను తీసుకొని వచ్చుటకు కూడా అవకాశం లేకుండా చేశారు. యిది నూతన రాజ్యాంగచట్టవ్యక్తి. సంఘ స్వాతంత్ర్యాలకు పూర్తి వ్యతిరేకం.

పై రెండు అనగా 154 M. E. R, 416 జి. ఓ. లు ఉపాధ్యాయ లోకాన్ని పుట్టుబానిసలగా తయారుచేస్తున్నాయి. ఈవిషయం ప్రభుత్వదృష్టికి అనేకసారులు తెచ్చినా ఆలికించకుండా వాటి అమలు జరుపుతూనే యున్నది.

కనుక ఉపాధ్యాయులంతా ఏకమై వీటి రెంటినీ రద్దుచేయించి వ్యక్తి సంఘ స్వాతంత్ర్యాలు, ఉద్యోగపు గ్యారంటీలు సంపాదించుకోవాలి అందుకుగాను రాష్ట్ర ఉపాధ్యాయులందరి తరఫునా ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచర్సు ఫెడరేషన్ విజయవాడ-హైకోర్టులో కేసులు దాఖలుచేయ దలచింది. ఆ కేసులు ఒక్క ఉద్యోగాలు, సర్టిఫికేటులుపోయి బాధపడే ఉపాధ్యాయులకు మాత్రమే సంబంధించినవి కాక రాష్ట్ర మొత్తంలోనున్న అందరు ఉపాధ్యాయుల (ఎలిమెంటరీ, హైస్కూళ్ళ వగైరా) సర్టిఫికేటుల గ్యారంటీలకు, వ్యక్తి సంఘ స్వాతంత్ర్యాలకు, సంబంధించినవి కూడాను. కాన ఉపాధ్యాయలోకంవిద్యాభిమానులు, యీ విషయాన్ని గుర్తిస్తారని ఆశిస్తున్నాం. యిందుకు ఆర్థికంగా చాలా ఖర్చులు కావలసియున్నవి. ఆం.రా. ఎ.టీ. ఫెడరేషన్ పేదసంస్థయను విషయం లోక విదితం. కాన సోదరులందరు ఉత్సాహంతో కృషిచేసి "బాధితోపాధ్యాయుల విధికి" విరాళాలు వసూలుచేసి యస్. రామకృష్ణయ్య కార్యదర్శి-ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచర్సు ఫెడరేషన్-సింగరాయకొండ P.O. నెల్లూరుజిల్లా ఎడ్రసుకుపంపి పై కృషికి సహాయపడ కోరుచున్నాను.

విజయవాడ, 22-11-1950.

చెన్నపాటి లక్ష్మయ్య,
అధ్యక్షుడు.
ఆ. రా. ఎ. టీ. ఫెడరేషన్

---

# పొరపాటు

రచన :
మంగళగిరి వెంకట కృష్ణదాసు
ఏలూరు.

(గత నెల సంచిక తరువాయి)

అర్థరాత్రి సమయము, అదిగో! పడిపోయిన గోడల పూరికొంపనలు ప్రక్కల తాటియాకులు లేచి పోవుటచే చల్లనిగాలి మెల్లగా ఇంటిలో ప్రవేశిస్తూ వుంది. గోడనున్న బెడ్ లైటు వెలుగు తల్లడిలిపోతుంది పొరపాటుచే కలవరపడుతూ కన్నీరు విడుస్తూన్న గోపాలు తలఎత్తిచూచాడు. తన తల్లిదండ్రులను నిద్రాదేవత ఆవరించింది. గాఢమైన నిద్రలో నిద్రిస్తూన్నారు. గోపాలు వారిపాదముల చెంతకు చేరాడు కానీ, ఆకస్మాత్తుగా గాలిచే గప్పున అరిపోయిందా లైటు వెలుగు. ఇల్లంతా చీకటిమయము ఏమోతోచక తలుపు తెరచుకొని బయటకువచ్చాడు. గాఢాంధకారము. ముందు వెనుకలు కలయచూచినా ఏమీకన్పించలా...హా...దైవమా...ఇంతేనా?...నా ఆసా జీవితము? మరోమార్గములేదా? లేదూ?... అవును ... నలువురిలో తలఎత్తుకొను మార్గమేది? మిత్రద్రోహినై మిత్రుల ఆశనోగొట్టుకొన్నానే? పొరపాటుచే ఉపాధ్యాయుల పరిచయము పాడుచేసుకొన్నాను. ఇరుగు పొరుగువారి మంచినికూడ మాపు చేసుకున్నాను. ఇన్నాళ్ళు చదివి సంపాదించినవిద్యా ఫలితము భగ్నమైంది. అన్నివిధాలదరిద్రుడనై యున్న నన్ను, సత్యమునకు, ధర్మమునకు నీతి; నియమాలకు కట్టుబడివున్న నాతల్లి దండ్రులు మాత్రము నమ్మెదరా? ... నమ్మరు ... నన్నెవరూ నమ్మరు... లేదా? ... ఈ ప్రపంచములో నాకిక తావులేదా? ... ఆ!... అదిగో ... ఎవరో పిలుస్తూన్నట్టుందే? మృత్యువా? ... కాదు "మోక్షదాయిని మోక్షదాయిని" అంటూ ముందుకు నడిచాడు. దారి తెన్ను కానక అతడెచ్చటికో పోతువ్నాడు ఎన్నో ఎదురు దెబ్బలు తగులుతువ్నాయి, చెట్లు-చామలు. గుట్టలు-మెట్టలు, కంపలు-కంచెలు, గోతులు. ఎన్నో అడ్డుకుంటున్నాయి. శరీరమంత గాయములతో రక్తము స్రవిస్తూంది. ఆప్రాణికి నొప్పిలేదే? నొచ్చుకోదే? అయోమయంగావుందే ఆ! ... అదిగో పెద్ద కొండ గుట్ట, చరచరా పైకెక్కి పరువులెడుతూ. ఎదురుగానున్న ఎత్తుబండలను ఢీకొన్నాడు. అబ్బా ... తలకు దెబ్బతగిలి గాయమై ఏకధారగా రక్తము స్రవిస్తూంది అంతటితోనే, క్రిందికి దొర్లిగిలిపోయాడు. మాట లేదు. మంచిలేదు. స్పృహావుంటేగా? పాపము! "అదృష్టముంటే అకస్మాత్తుగా వచ్చే ప్రమాదాలు కూడ అమృత ఫలమై సిద్ధిస్తాయట" అట్లాగే అగాధమైన దెబ్బలతో అంతము కాబోయేగోపాలు కొండ కార్మికులకంట బడ్డాడు. ఆదావులోనున్న సాధుల మఠానికి చేర్చారు. గాయపడిన చోట్లంతా ఏవోపసర్లతో కట్టుకట్టారు. లోకజ్ఞానము తెలియక కష్టములు నష్టములు, గ్రహించలేని మూర్ఖులు, మోటు వారు ఏమిచేయగలరు? తల్లిదండ్రులైతేగా దగ్గరకు తీసి, ఆపదలు తెలుసుకొని ఆదరించటానికి? దైవవైపరీత్యమునకు ఏవరు ఏమిచేయగలరు? ఆహా! రానున్న కష్టాలు ఊరకనే పోతాయా? మిన్నువిరిగి మీదపడినపుడు, తప్పక అనుభవించి తీరవలసినదే, కానీ దైవమాయ ఎవరు గుర్తించగలరు?

(గోపాలుని యిల్లు)

బళ్ళున తెల్లవారింది. కాకులు కూస్తూన్నాయి. ప్రపంచమంతా మేలుకుంది. సూర్యుడుదయిస్తూ న్నాడు. వనితలు వీధివాకిళ్ళు తుడుస్తూన్నట్లు, నలు ప్రక్కలనుండి చిన్నపిల్లల గందరగోళములు, పెద్ద ధ్వనిచేస్తూ వినవస్తూన్నవి గోపాలుని తల్లి వులిక్కిపడి లేచింది. తలుపులుతీసివుంది; సూర్యుని కిరణాలు సూటిగా లోనికిప్రవేశిస్తున్నాయి. ఇల్లంతా నిశ్శబ్దము గావుంది, తెల్లవారగానే "అమ్మా! అమ్మా! త్వరగా వంటచేయవే? స్కూలుకు టయమయిపోతుంది, "అంటూ. తొందరచేస్తూంటే గోపాలునజాడ ఏది? ఏమైనాడు? ఎక్కడున్నాడు? ఆ తల్లికి అర్థము కాలేదు. ఆ మరుచటి రాత్రఅన్నమయినా తిన్నాడా లేదు. అమ్మాయని పిలిచాడా? లేదు. ఆ తల్లిని హృదయము కంగారయింది.

"ఏమండీ! ఏమండీ!" అబ్బాయిఏడీ? ఎక్కడకు వెళ్ళినట్లు? వాడి పుస్తకాలు, నట్టింటనే వున్నాయి? వాడేమైనాడో? మాటలాడరే? కన్నకొడుకు విషయమువిూరచి కండ్లుమూసుకొన్నారే?

మీ నిద్రామీరు ? అబ్బాయి ఏమైనాడో ఆలోచించారా అంటూ తొందరపడుతూ అడిగింది ఆతల్లి ఆమె భర్తను.

"ఆ!...అబ్బాయా?...ఏమోనే ? రాత్రిమధ్య రాత్రిలోనే దీపము ఆరిపోయింది. అప్పటినుంచి ఆ తలుపు ఆలాతీసేవుంది. అబ్బాయి బయటకు వెళ్ళేడేమో అనుకున్నా ? ఎక్కడకువెళ్ళాడో ? అయినా రామారావుగారి అబ్బాయి ప్రసాదు దగ్గరకు వెళ్ళాడేమో ? తెలుసుకొనివస్తా.

ఆతడు ముసలివాడు. నడుమశక్తి చాలదు. కర్ర సహాయముతో ప్రసాదు ఇంటికివెళ్ళి "ప్రసాద్ ! ప్రసాద్ అంటూ! తలుపు తట్టాడు.

పొరపాటుచే కలతజెంది కళ్ళుమూసుకొని మగత నిద్రలో వున్న ప్రసాదుచెవులు గింగురుమన్నాయి. గోపాలే వచ్చాడని తొందరపండిందా ప్రాణి. "ఆ! ... వస్తున్నా" నంటూ. తలుపుతెరచాడు. తానొకటి తలిస్తే దైవమొకటి తలంచినట్లు గోపాలునకు బదులు ఆతనితండ్రే ప్రత్యక్షమైనాడు. ప్రసాదు గుండెలు అదురుకున్నాయి. కాళ్ళుచేతులు గజగజా వణుకుతున్నాయి నోటిమాట రావడములేదు.

"ప్రసాద్ ! మాగోపాలు డేడీ ! రాత్రిమాయింటికి రాలా?" అని యాముసలితండ్రి అడిగేసరికి ప్రసాదు గుండెలో రాయపడినట్లయి, మనస్సంతా కంగారైంది ఏమి జవాబు ఇవ్వాలో అర్థముకాలా. గోపాలాడేమైనాడో ఎక్కడకుపోయాడో? అతనికిమాత్రము ఏమితెలుసు ? నోటుమాటరాక పాషాణ ప్రతిమలాగా నిలబడిపోయాడు.

"నిన్నేనయ్యా! మాట్లాడవేం? మాగోపాలుడేడీ?

"అ!...మీగోపాలుడా? ... మా ... మాష్టరు ఇంటికి వెళ్ళాడు, వస్తాడులెండి. అయ్యో చాలా శ్రమపడి వచ్చారే ? నేను, గోపాలు కలిసివస్తాము మీరు ఇంటికివెళ్ళండి. ప్రాణస్నేహితుణ్ణి నేనుండగా మీ అబ్బాయికేమీ పరవాలేదు. ఇప్పుడేవాస్తాము అని ప్రసాదు జవాబు చెప్పాడు ఏమీతోచక

గోపాలునితండ్రి ఆమాయమాటలునమ్మి ఇంటికి వెళ్ళిపోయాడు, తన కుమారుడు ఎచ్చటకోపోయాడు ఏవిషాద గ్రహాలకు గురియైనాడో అతనికేమితెలుసు అసలువిషయము తెలియనపుడు నమ్మక ఏమిచేస్తాడు? ఏమైనా అనుమానముండేగా ..........నమ్మకపోవడానికి ?

ప్రసాదుమనస్సు నిలువున నీరైపోయింది. గోపాలు డెక్కడున్నాడో ? ఏమైనాడో ? ఎలా తెలుస్తుంది. గోపాలు, కష్టాలలో కూడ తనజీవితమంతా చిరునగవుతో కాలము వెళ్ళబుచ్చు మహనీయుడు. చలనములేని మనస్సుకలవాడు, కానీ, పట్టుగొమ్మవలె ఆధారభూతమైన తనచదువు, నాశనమైనందులకు లోకాపవాదమునకు వెరచి, మనస్సుచెడి, ఎట్లు పరారీ అయినాడో ? ఏవిషగ్రహాలలో చిక్కుకొన్నాడో ? దీనికి మూలకారకుడనై యున్న నేను సుఖముగా జీవించడమా ? పొరపాటు, అతని తల్లిదండ్రుల హృదయము ఎంతతొందరుపడుతుందో? నడుమ శక్తి చాలక, కర్ర నాధారముగా జేసుకొని, తనకుమారుని గూర్చి ఎంత ఆగుర్దాతో అడిగాడు. మాయమాటలు చెప్పాను. నాది పొరపాటు... అతని జీవితమునకు చిచ్చుపెట్టి, అతని తల్లిదండ్రులను బాధించుచున్న హంతకుడను నేనే? నాగోపాలుడు నాకు కనిపిస్తాడా ? గోపాల్ ! గోపాల్ ! అంటూ వెర్రికేకలతో, తనస్కూల్లో తనరూముకు వాచరైన గోవిందుగారి ఇంటికి వెళ్ళాడు. (మనస్సు చెడి పిచ్చివాడులా వున్నాడు.)

గోవిందు ఏమో ఆలోచిస్తూ బయట వరండాలో కూర్చొనియున్నాడు. —

"మాష్టారూ ? మాష్టారూ ? గోపాలేడీ ? ఏడీ ? అతన్నెచటకు పంపారూ ? ఏమైనాడూ ? చెప్పండీ చెప్పండీ ?" అని ప్రసాదుగోలపెట్టాడు.

"ఏమైనాడో ? నాకేమితెలుసు ? ఏమిట్రా ఆపిచ్చికేకలు ? అంటూ అయన మండిపడ్డాడు.

"పిచ్చివాడనా ? మాష్టరూ ? గోపాలుజీవితానికి చిచ్చుపెట్టిందెవరు ? నీవే ? రూల్సుకు వ్యతిరేకముగా కాపీచేసి, కయ్యములాడుకొని పిచ్చివేషాలు వేస్తావే ? వెధవా ? డొక్కచీరేస్తా ఏమిట్రా వెర్రిమాటలూ ?"

"నేనె, గోపాలు జీవితానికి చిచ్చుపెట్టిందినేనే? అంతటి మిత్రద్రోహిని నెనే? పొరపాటు. నా గోపాల్ నాకు కనిపిస్తాడా ? గోపాల్ ! గోపాల్ అంటూ పిచ్చివాడై, దారి తెన్ను మంచిచెడ్డలు కానక ఎచ్చటకో పోయాడు. కాసేపట్లో ప్రసాదు కూడా మాయమయినాడు. ఎక్కడకు పోయాడో? ఏమైనాడో ?

"మంచివారి స్నేహము మరణించిన పోదట; చెడ్డవారి స్నేహము క్షణకాలము నిలువదట" మనస్సుకు మనస్సు ఇచ్చి ఆత్మమిత్రులైన వారిప్రాణాలు వేరవుతాయా ? ఎప్పటికి కావు. ఆత్మమిత్రుడైన ప్రసాదు మనస్సు, గోపాలుని మనస్సులో ఏకమై

యుండవచ్చు. వారి పవిత్రమైన కళేబరాలు, కలియకపోయినా ఆదగ్గర ప్రాంతాలలో చేరి వుండవచ్చు.

మాష్టారు :

హృదయము నిలువున నీరైపోయింది. చూస్తూండగానే ఇంతవరకూ నాతో మాట్లాడి, కనురెప్పపాటు కాలములో ఇట్టే మాయమయినాడు. ప్రసాదు ఏమయినాడో? ఆశ్చర్యము. గోపాల్ పరారీ కాకపోతే ఇతనికి పిచ్చి ఎందుకు పడుతుంది? పాపం! వృద్ధులు - నడువశక్తి చాలదు-దిక్కు లేదు. నిరక్షరకుక్షులైయున్న గోపాలుని తల్లిదండ్రులు ఎంత ఘోషిస్తున్నారో? ఇంతకూ మూలకారకుడను నేనే? తెలియక చేసిన పొరపాటు ఎంతగాథ అయింది? నా విధి నేను నెరవేరిస్తే ఇంత విషాదగాథ ఎందుకొస్తుంది? అయినా హెడ్ మాష్టరుతో ఆలోచిస్తా. ఏమౌతుందో? అని తలపోసి ఆయన మనసు బిగబట్టలేక ఆదుర్దాగా హెడ్ మాష్టరు ఇల్లుచేరాడు.

హెడ్ మాష్టరు ఏదో వ్రాసుకొంటూ కుర్చీలో కూర్చొనియున్నాడు. ఆదుర్దాగా వచ్చిన మాష్టరును చూచి "ఏమండీ! ఏమిటూ విశేషము? ముఖమంతా కళావిహీనంగా వుందేః" అని ప్రశ్నించాడు.

"ఆ!...ఏమిచెప్పను? ఏమో తెలియక పొరపాటు చేశాను. క్షమించండి. నా విధి నేను నిర్వర్తించక, పిల్లల కాపీలు గ్రహించక అమాయకంగా ప్రసాదు గోపాలు పరీక్షాపత్రములపై రిమార్కు వ్రాసి తమకు పంపాను. అపరాధిని. వారి జీవితమునకు శనివలె దాపరించాను. క్షమించి వారి సర్టిఫికట్టుమీద ఏ పాడు రిమార్కు వ్రాయకండి. వారు విజయవంతులు కాకపోయినా రెండవ సంవత్సరము చదువుకొనుటకు పర్మిషను ఇవ్వండి. ఆ విద్యార్థులకు విద్యాభిక్ష పెట్టండి" అని ఆయన దీనభావంగా అడిగాడు.

"నీవు పొరపాటుచేసి నన్ను క్షమించమంటావే? జరుగవలసిందేదో ముందుగానే జరిగిపోయింది. పరీక్షా పత్రములపై (కాపీడ్) అని మీరు వ్రాయటము నావల్ల ఎర్రసిరాతో వారి సర్టిఫికట్లు రిమార్కు వ్రాయబడి నాశనము కావడమూ ఒక్కసారే. మాష్టరులందరూ సక్రమంగా తమ విధిని నెరవేరుస్తారని అనుకుంటాము గాని ఇంత ప్రళయము తెస్తారని అనుకుంటామా? ఇప్పుడే పైవారికి తెలియజేస్తాను. నీ సంగతి ఏమవుతుందో ఆలోచించుకో" అని మహోగ్రుడైనాడు హెడ్మాష్టరు.

గోవిందరావుగారికి పిచ్చెత్తినట్లయింది. ఉద్యోగం ఊడిపోతుందేమో అని ఆయన చాలా భయపడ్డాడు. అదే నిజమైతే యీ కరువుకాలంలో భార్యాబిడ్డలెట్లా బ్రతికిస్తాడు? తాను చేసినది పొరపాటని తెలుసుకొన్నాడు. తన పొరపాటువల్ల గోపాల్, ప్రసాదుల విద్య పాడగుటయేగాక వారి జీవితాలు గూడ పాడైనవని గుర్తించాడు. ఇదంతా విద్యార్థుల ద్వారా అప్పుడే పదుగురిలోకి ప్రాకిపోయింది. అవమానంకూడా ఎక్కువైంది. ఏమిచేయటానికి తోచలేదు. తన తొందరపాటునుగూర్చి అనేకవిధాల తలపోస్తూ, తన పొరపాటుకు ఎంతో చింతిస్తూ ఆయన కూడా మతిచెడి "గోపాల్! ప్రసాద్!" అంటూ ఎక్కడికో పోయినాడు. అతనిజాడ మతి తెలియలేదు.

హెడ్ మాష్టరు :

"ఒక్క పొరపాటుచే ఇద్దరు విద్యార్థుల జీవితాలు పాడైపోయినాయి. వా రేమైనారో? గోవిందుకూడ పాపం! మతి చెడినవానివలె లేచిపోయాడు. ఆయన సంగతి యేమయిందో? ఎంత దారుణగాథ సంభవించింది. నేనుకూడా యీ విషయంలో చాలా తొందర పడ్డాను. నిజంగా ఇది నా పొరపాటే. నిజానిజాలు విచారించకుండా వారి సర్టిఫికెట్లు పాడు చెయ్యడం ఏమంత సబబైనపని? అయినా ఇప్పుడే మనుకుంటే యేముంటి? వాళ్లు కాపీ చెయ్యకపోతే యింత ప్రమాదం జరిగేదే కాదుకదా? వాళ్ల తల్లిదండ్రులకు యీ బాధ కలిగేదే కాదుకదా? కాపీ చెయ్యడమెందుకు? ఈ విధంగా జీవితాలు పాడు చేసుకోవడ మెందుకు? ఒక్కొక్కప్పుడు ధర్మాచరణం కూడా బాధాకర మవుతుందంటారు. ఇందు కే కాబోలు" అని పరిపరివిధాల తలపోస్తూ యెంతో విచారపడ్డాడు.

ఈ పొరపాటువల్ల మొత్తంమీద చెప్పరానంత సంతాపం కలిగింది. ఆ యిద్దరుపిల్లలూ చివరి దశలో ఒకరినొకరు కౌగలించుకొని ఆ కొండ గుట్టదగ్గర - ఆ సాధుల మఠంలో పడిపోయినారనీ - వారి పవిత్రాత్మలు ఏకమైనాయని తెలియవచ్చింది. గోవిందరావుకు పిచ్చియెత్తిందని పుకారు మోగింది. ఒక్క పొరపాటుచే విద్యాప్రపంచంలో ఈలాంటి విషాద సంఘటనలు కూడా నేడు సంభవించు చున్నవని వ్రాయుటకు

దుఃఖసముద్రంలో మునిగిపోయిన
నా కలం జరుగుటలేదు
ఇంక సెలవు.

వచ్చే సంచికలో మరోకథ.

## కపటవేషము

చినగుడబ తిరుపతిరావు పట్నాయక్

గీ. కపట వేషంబు పలనను గలుగు వాసి
వసుధ నిజము బయల్పడువరకె నిలుచు !
కల్ల తెలిసినపిమ్మట నెల్లజనులు
మోసగానిని ద్వేషింతు రీసు పూని.

గీ. తెలివిగలవారు దుష్టుల పలుకు నమ్మి
యొక్కయప్పుడు నేమఱి యుండ దగదు !
ఆత్మరక్షణ మేమఱి యహితు లాడు
తేనెమాటలు పాటింప హాని వచ్చు.

గీ. తల్లిదండ్రులు చెప్పుహితంబు వినక
దుష్టవర్తనులై స్వతంత్రుల మటంచు
నిక్కెదరు బాలకులు కొంద రక్కటకట !
సిగ్గుపడ రారతమదు దుశ్చేష్టలకును.

గీ. మదిని బరులెట్లు చేయఁగోరుదుమొ మనకుఁ
బరుల కట్లె చేయఁగఁ జూడవలయు మనము;
ఒరుల కపకార మొనరింప నూహచేయ,
నవల మనకును నపకార మావహిల్లు.

గీ. విక్కి విఱుగఁ బడుటకంటె వినయమునవె
సమధిక ప్రయోజన మెందు సంఘటిల్లు ;
స్వల్పకాలమోర్పునఁ దల వంచుకొన్న
ఘనత నెప్పుడుఁ దల యెత్తుకొనగ వచ్చు.

---

# శిశు గేయములు * * * *

సి. హెచ్. విశ్వనాథం - హెడ్మాష్టరు - అక్కపల్లి.

## కాకి - కూజ

దాహమగుట కాకి చాల డస్సిడస్సి తిరిగెనూ
వేసవగుట నీటినెచట నెఱుగలేకపోయెనూ
అప్పుడెట్లొ నొక్కకూజ అవ్వయింట చూచెనూ
అందులోని నీరు చాల అడుగుజేరి యుండెనూ
ముక్కుకందలేక చాల ముందువెనుక జూచెనూ
చెంతనున్న గులకరాళ్లుచేర్చి నింపెకూజనూ
నీరు పైకి నుబకగానె నింపుగాను త్రాగెనూ
తలపుచేత నెట్టిదయిన తనివి జేయవచ్చునూ

## బాతు - బంగారు గ్రుడ్లు

కాపు ఒకడు బాతునొకటి కరుణతోడ పెంచుచున్
దాని పసిడిగ్రుడ్లవలన ధనము కూర్చుచుండెనూ
ఒక్కదినము గ్రుడ్లనన్ని వరుస నమ్మతలపునన్
చక్కగాను బాతు నట్టె చంపి చూచె వేడ్కనూ
పొట్టలోన గ్రుడ్లు గనక పొర్లిపొర్లి యేడ్చుచున్
ఆశచేత ఫలమురాదు అనుచు నేడ్చెపిమ్మటన్.

## కుక్క - మాంసపు ముక్క

ఆకలిపొందినకుక్క యొక్కటది
అంగడిలోపల తిరుగాడెన్
మాంసపుఖండము నోట గఱచుకొని
మరియొకచోటికి పోదలచెన్
దారిమధ్య నదివంతెన యొక్కటి
దాటగవలసెను తొందరతోన్
నీటిలోప లది నీడను జూచుచు
నిజమొక కుక్కని తలపోసెన్
దాని నోటిలో మాంసపుముక్కను
తప్పకపొందుదునని యాశన్
గొప్పగ మొరిగెను నీటిలోపలను
గోలుపోయె నది తనముక్కన్.

# ఆదర్శప్రశ్న పత్రము - తెలుగు

(ఉ.రా_జవాబులు మీసొంత మాటలలోనుండవలెను.వర్ణక్రమములో తప్పులుండరాదు)

కాలము _ 2 గంటలు మార్కులు

1. ఈ క్రింది వానికి సందర్భములు వ్రాయుము
   1 పెనుగాలిలోని దీపకలికవలె చపలయగు సిరివలన లాభమేమి ?
   2 స్త్రీల యోర్వమి అద్భుతముగదా ?
   3 దుఃఖము సుఖముగా పరిణమించిన ఎవరుసంతసింపరు ?
   4 సీతలం పెఱింగియే నేనిట్లు పంచితి ?
   5 గాజుపెంకుల కొరకు ముత్తెమును పోగొట్టు కొనవచ్చునా ? 10
2. ఈ క్రిందివానికి పూర్వగాథలు వ్రాయుము
   1 దుశ్శాసనుని రొమ్మునుండి యింకనూ నా(క)ూరుడు త్రావగా మిగిలినరక్తము ప్రవహించుచున్నది?
   2 మాకు అమృతముతెచ్చి యిచ్చిన సీతల్లినిగొనిపొమ్ము ? 6
3. ఈ క్రిందివానికి వాక్యపు జవాబులిమ్ము
   1 జీమూత వాహనుడు లోకమున దరిద్రముజేసెను ఎట్లు ?
   2 వజ్రాన తద్రాజ్యమునకు పట్టముగట్టె ఎవరు ?
   3 పాములకు నాలుకలు చీలికలయ్యె ఎందువలన ?
   4 వాసుకి ఒడంబడిక ఏమి ? ఎవరితో ? ఎందుకు ?
   5 ఖనకుడు పాండవుల నెట్లు రక్షించెను ? 5
4. నాలుగు పంక్తులు జవాబులు వ్రాయుము
   1 మతిచెప్పగలేము ధరాతలంబునన్ ఏది ?
   2 పరీక్షిత్తు ఎట్లు చచ్చి బ్రతికెను ?
   3 పురుషులు సైరంధ్రీవేషముననున్న ద్రౌపదిని జూడవెరతురు ఏల ? 12
5. ఈ క్రింది పద్యముకు పాదభంగముగాకుండ వ్రాయుము
   1 మనమున నూఱడిల్లుమనుమానము............వృద్ధులు మెచ్చజెప్పెదన్. 6
6. అర్థవుట జవాబులు వ్రాయుము
   1 కృష్ణ నిర్యాణానంతర అర్జునుడుద్వారకా నివాసులను హస్తిపురికిజేర్చుట.
   2 భీష్ముడు ధర్మజుని కుపదేశించిన యుపదేశములు.
   3 గాంధారి రణరంగవర్ణన.
   4 ఏనుగుల స్వైరవిహారము. 16
7. ఈ క్రింది పద్యమునకు తాత్పర్యము వ్రాయుము
   1 అమరగవిద్యమైగల......తద్దురంగట బుద్ధిభూపతీ 4
8. **A** కలాపము, ఉపధానము, గుణము, స్రుక్కు - నానార్థములు వ్రాయుడు 6
   **B** జాలకము, పురి, రాతిరి, విధాత - పర్యాయపదములు వ్రాయుడు 4
   **C** అనురాగము, కలిమి, ఖేదము, ఉచితము - వ్యతిరేకపదములు వ్రాయుడు. 2
   **D** గట్టువాలు, సముద్రము, సౌధము, ద్విరదము - వ్యుత్పత్త్యర్థములు వ్రాయుడు 4
   **E** లావణ్యము, సింధురము, కూర్కు, వడముడి - అర్థములు వ్రాయుడు. 2
   **F** కుడ్యము, దరి మూర్ఖుడు, గృహము-ప్రకృతులకు వికృతులు, వికృతులకు ప్రకృతులు వ్రాయుడు 2
   **G** గంగోర్మికలు, ముఖపద్మము, హలపాణి, కరపల్లవము - సమాసములు వ్రాయుడు. 4

H మహాత్ముఁడు. ఇత్యాదులు శ్లోకోదిగ్ని, సద్రైవ్యాశ్యము..వీనినివిడదీసి సంగ్నుల పేర్లను వ్రాయుడు 2

9. క్రిందివానిలో ఒకదానికే వ్యాసము వ్రాయుడు :—

రేడియో వలనలాభములు

మన దేశపరిపాలన

నీవుచూచిన ఒక తెలుగు సినిమా 15

(షరా—20 పంక్తులు మించరాదు)

అల్లంరాజు బంగారం – శంఖవరం.

---

## ఆదర్శ ప్రశ్నపత్రము - లెక్కలు

(షరా–ప్రతిలెక్కకు వర్కుంగుచూపవలెను.)

కాలము 2 గంటలు　　మార్కులు

1. మీటరు = 39.37 అం॥లు. 1 గజము ఎన్నిమీటర్లు ? శతాంశమునకు సరిచూడుము. 10
2. ఒకడు తన ఆస్తిలో $\frac{1}{2}$ పెద్దకుమారునకు, $\frac{1}{3}$ కుమార్తెకు, మిగిలినదానిలో $\frac{1}{3}$ భార్యకును మిగిలినది రెండవకుమారునకు, యిచ్చెను. కుమార్తెకు భార్యకన్న రు. 500 లు ఎక్కువ వచ్చిన రెండవ కుమారున కిచ్చినదెంత ? 10
3. A వద్ద B ఒకగుఱ్ఱమును కొని 10% నష్టముతో C కు అమ్మెను. C తిరిగి రు. 891 లకు అమ్మి 20% లాభమును పొందెను. B గుఱ్ఱము నెంతకు కొనెను ? 10
4. ఒక అశ్వికుడు ఎత్తైన కొండమీదికి గంటకు 15 మైళ్ళ వేగముతో పోయి తిరిగి గంటకు 25 మైళ్ళ వేగముతో దిగివచ్చెను. వాని సరాసరీ వేగము గంటకెన్ని మైళ్లు ? 10
5. **A.** బారువడ్డీప్రకారము మొత్తము కనుగొనుటకు సూత్రము వ్రాసి నీ వేగుర్తుల నుపయోగింతువో వ్రాయుము. 4

   **B.** సం॥రం॥ కు 5% చొ॥న ఎంతసొమ్ము 9 ఏండ్లలో రు 754 లు మొత్తమగును ? 6
6. ఒక చెఱుకుకఱ్ఱను 7:8 నిష్పత్తిలో రెండుముక్కలుగా విరిచితిని. చిన్నముక్కను మరల 2:3 నిష్పత్తిలో రెండుముక్కలుగా విరచితిని. యిప్పుడు ఏర్పడిన మూడుముక్కలు ఏనిష్పత్తిలో నుండును ? 10
7. గజమునకు రు. 0-1-8 లు వంతున ఒక వలయాకారపు స్థలమునకు కంచెవేయుటకు రు.59-9-4లు అగును. ఆస్థలముయొక్క వైశాల్యము కనుగొనుము. ($\pi$ $3\frac{1}{7}$) 10
8. 1 ఘనఅడుగు = $6\frac{1}{4}$ గాలనులు లేక $62\frac{1}{2}$ పౌనులు. 5′ పొడవు 4′ వెడల్పు 3′ లోతుగల పీపా ఎన్నిగాలనుల నీరు పట్టును ? దాని బరువెంత ? 10
9. ఒకపనిని 20 దినములలో 24 గురు చేయగలరు. అందరు కలసి 15 దినములు పనిచేసి అందుండి 8 మంది మానివేసిరి. పని పూర్తిచేయుటకు అసలు కాలముకంటె ఎంతఎక్కువకాలము పట్టును? 10
10. ఒకమేడ పైభాగమునుండి 600 గజముల దూరములో నున్న మైలురాతిని 40° నిమ్నకోణములో చూచెను. పటముగీచి మేడయెత్తు కనుగొనుము. 10

అల్లంరాజు బంగారం—శంఖవరము.

---

## ఆదర్శ ప్రశ్నపత్రము - చరిత్ర

కాలము 2 గంటలు

ఈ క్రిందివానికి ఒక్కొక్కమాటలో జవాబులిమ్ము.

1. కాళికా దేవాలయమును ధ్వంసముచేసిన బానిసరాజెవరు ?

2. మంగోలులనాయకు డెవరు ?
3. సాధుపుంగవుడను బానిసరాజెవరు ?
4. అక్బరు కాలమునాటి పన్నుల పద్ధతి నెవరు ప్రవేశపెట్టిరి ?
5. సిక్కుల వేదమెద్ది ?
6. ఫ్రెంచివారికి బంగాళమున ముఖ్యనగరమేది ?
7. ఉరితీయబడిన ఫ్రెంచిగవర్నరెవరు ?
8. రైతుమిత్రుడని పేరొందిన గవర్నరెవరు ?
9. రాజప్రతినిధులలో కెల్ల నగ్రస్థానము వహించిన ప్రభు వెవరు ?
10. "జగత్ప్రకాశ"మని ప్రఖ్యాతిగాంచిన రాణి యెవరు ? 10

(2) ఈ క్రింది యుద్ధములు ఎప్పుడెవ రెవరికి జరిగెను ?

1. వందవాసి యుద్ధము. 2. బక్సారుయుద్ధము. 3. సిక్కియుద్ధము. 4. రెండవ పానిపట్టు యుద్ధము. 5. కళ్ళికోట యుద్ధము. 10

(3) బ్రహ్మసమాజ మతస్థాపకు డెవరు ? అతడు చేసిన ప్రధానసంస్కరణము లేవి ? 4

(4) వార్తాపత్రికలకు స్వాతంత్ర్యమిచ్చిన గవర్నరు జనరలెవరు ? దాని ఫలితమేమి ? 3

(5) భరత్ పూర్ కోట ఇంగ్లీషువారి వశమెప్పుడయ్యెను ? 3

(6) యూరోపియనులు మనదేశమున కెందుకు వచ్చిరి ? వారు స్థాపించిన వర్తక సంఘములెవ్వి ? 5

## భూగోళము

(7) ఈక్రిందివానికి ఒక్కమాటలో జవాబులిమ్ము.

1. సింధునదికి ఆనకట్ట ఎచ్చట కట్టబడినది ?
2. మనదేశములో బంగారము ఎచ్చట ఎక్కువగా దొరకును ?
3. గడియారములను తయారుచేయు దేశములలో ముఖ్యమైనదేది ?
4. ఫ్రాన్సులో మోటారులు తయారుచేయు కర్మాగారముగల పట్టణమేది ?
5. ప్రపంచములో రబ్బరును ఎక్కువగా వుత్పత్తిచేయు దేశమేది ?
6. ఆల్ప్సు అనగా నేమి ?
7. చైనాయందలి అంతర్జాతీయ రేవుపట్టణమేది ?
8. ప్రపంచ మంతటిలోను పెద్ద రెలుమార్గమేది ?
9. ప్రపంచములో పెద్ద బొగ్గుగని ఏది ?
10. గోధుమలను ఎక్కువగా పండించు దేశమేది ?

(8) ఈక్రిందివానికి కారణములిమ్ము.

1. "హోయాంగుహో" నది చైనాకు దుఃఖదాయిని.
2. స్వీడనుకంటె నార్వేయందు వెచ్చగానుండును.
3. ఇంగ్లండు తీరప్రాంతములయందు మత్స్యపరిశ్రమ అభివృద్ధి గాంచినది.
4. జపాను ఎందుకు పట్టుపరిశ్రమకు ప్రసిద్ధి ?
5. పంజాబునందు గోధుమలు విరివిగా పండింపబడుచున్నవి.
6. బంగాళమునందు జనసంఖ్య ఎక్కువ.
7. ఢిల్లీలో బొంబాయికంటె ఉష్ణోగ్రత ఎక్కువ.

౪. స్విట్జర్లాండులో హోటళ్లు ఎక్కువ. 8

(9) 1. మధ్యధరాశీతోష్ణస్థితి యననేమి ?

2. ఋతుపవనము లననేమి ?

3. ఫియర్డులు అనగానేమి ?

4. ప్రత్తిపంటకు అనువగు పరిస్థితులెవ్వి ?

(10) ఈ క్రింది దేశములయొక్క ముఖ్యపట్టణములు పేర్కొనుము.

1. స్పెయిన్, 2. నార్వే, 3. సుమిత్రా, 4. రష్యా, 5. టర్కీ, 6. జపాను. 3

(11) 115° తూర్పు రేఖాంశముమీద నున్న పీపింగువద్ద మధ్యాహ్నము 12 గంట లయినపుడు గ్రీనిచ్ వద్ద కాలమెంత ? 6

## సి వి క్సు

(12) ప్రజలు పన్ను లెందుకు చెల్లించవలెను ? 5

(13) ప్రభుత్వముయొక్క ధర్మములెవ్వి ? 5

(14) హిందూదేశ మెప్పుడు విభజింపబడెను ? 2

(15) ఇండియన్-యూనియన్‌లోని రాష్ట్రములేవి ? 9

(16) రక్షణ అధికారములోని ముఖ్యమైన 3 శాఖలను చెప్పుము. 3

(17) ఒక గ్రామపంచాయితీ ధర్మములను వ్రాయుము. 4

(18) సహాకారోద్య మననేమి ? 6

మొత్తము 100

అల్లంరాజు బంగారం——శంఖవరము

## మునిసిపల్ టీచర్సుకు యింట్లఅద్దె లివ్వాలి

ఆర్యా !

ముష్టిజీతాలతో, యమయాతనలనుభవిస్తున్న ఉపాధ్యాయులవైపు మన రామరాజ్య పరిపాలకుల దృష్టి పారనేలేదు. పాపం వారికి తీరికేదీ ! ఆస్వల్పజీతాలలోనే కాపురముంటే యింట్లకు, కాదుకాదు-మోటారు షెడ్డులకుకూడా-పాతికవంతు జీతాన్ని అద్దెలక్రింద తగలెయ్యవలసి వస్తున్నది. మొత్తం ఉపాధ్యాయులలో చాల భాగమునకు ఈ అద్దెలభారంవున్నా, మునిసిపల్ పట్టణాలలో నివసించే ఉపాధ్యాయులు యింటిఅద్దె లిచ్చుకోలేక సతమతమగుచున్నారు.

మధుర, బెజవాడ, మొదలగు మునిసిపాలిటిలలో యింట్లఅద్దెలు ప్రభుత్వమిచ్చుచున్నది. మిగత మునిసిపాలిటిలలో జనాభా కొద్దిభేదం తప్పితే బాడుగలలో యేమాత్రం తేడాలేదు.

విద్యా విజ్ఞానాల వైపు దేశాన్ని నడిపించాలని చెప్పే ప్రభుత్వం, వానిని గఱపే ఉపాధ్యాయులకు, ముఖ్యంగా మునిసిపల్ మునిసిపల్ టీచర్లకైనా కనీసం యింటిఅద్దెలను మంజూరుచేసి తన విద్యాభిలాషను ఋజువు చేసుకోవలెనని కోరుచున్నాను.

మకాం. ప్రొద్దుటూరు, వి. విజయరామరాజు,

తేదీ 27—12—50. కడపజిల్లా ఉపాధ్యాయసంఘం-కార్యదర్శి.




1950 సం॥ డిశెంబరు నెల మన భారత దేశానికి గొడ్డలిపెట్టువంటిది. ఈ నెలలో ఆధ్యాత్మిక రంగమునుండి ఒక యోగిపుంగవుఁడు - భౌతికరంగమునుండి ఒక రాజకీయ ధురంధరుడు - నిష్క్రమించినారు. వీరి నిష్క్రమణము భారత ప్రజానీకానికి తీరని లోటు. ఇది తలవనితలంపుగా మనకు తగిలిన పెద్దదెబ్బ.

మన భారతదేశములో ఎందరెందరో మహా పురుషులు జన్మించినారు. కటిక చీకటిలో మునిగిపోయి కన్నుగానని ఖండ ఖండాలకు వెలుగుదారులు చూపించినారు. సమస్త ప్రజాకోటికి శాంతి - అభ్యుదయాలను ప్రసాదించినారు. వారిపవిత్రజీవితాలు ఒక్కభారతదేశానికే గాక యావత్ప్రపంచానికి ఆదర్శనీయాలు.

ఆధునిక యుగములో - ముఖ్యముగా ఈ శతాబ్దిలో - రాజకీయాలను, ఆధ్యాత్మిక విషయాలను, మథించి రెంటిలోను అత్యున్నతస్థాయి నందుకొని, రాజకీయవేత్తయై విప్లవవాదియై సాధకుఁడై మహాయోగియై దివ్యజీవనుఁడై దివ్యత్వమును పొందిన వాడు అరవిందుఁడు. మనదురదృష్టముకొద్ది ఈయోగిపుంగవుఁడు కడచిన నెల 5-వ తేదీన కన్నుమూసినాడు. అవసరమైన సమయములో - యావద్విశ్వము శాంతి - శాంతి - అని మొత్తుకొనుచున్న సమయములో - శాంతిని ప్రసాదింపగల యీ యమర కుమారుని పోగొట్టుకొని నేడు మనభారతమాత వెక్కివెక్కి యేడ్చుచున్నది. ఈ తల్లిని అనునయించుటయెట్లు?

అరవిందుడు వంగదేశీయుడు. ఒక సనాతన వైదిక కుటుంబమునకు చెందినవాడు. కాని యాకుటుంబము కాలప్రభావముచేత బ్రాహ్మమతమునకు నిలయమైపోయినది. అరవిందుని తండ్రియైన కృష్ణధనఘోష్ సంఘసంస్కరణాభిలాషియై బ్రాహ్మమతమును స్వీకరించి ఆధర్మప్రకారము బ్రహ్మసమాజ కన్యకయైన స్వర్ణలతాదేవిని పరిణయమాడినాడు. ఈ పెండ్లికి విశ్వవిఖ్యాతిగన్న కేశవచంద్రసేనుడు, మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు; పౌరోహిత్యమువహించుట గమనింపదగిన విషయము.

ఈ దంపతులకు నలుగురు పుత్రులు-ఒక పుత్రిక జన్మించిరి. వీరిలో మూడవపుత్రుడే అరవిందుఁడు. ఈయన 1872 సం॥ ఆగష్టు 15-వ తేదీన జన్మించెను.

కృష్ణధనుడు మొదటినుండి పాశ్చాత్య నాగరకతా వ్యామోహముగల వాడగుటచేత తనబిడ్డలకు దేశీయ పాఠశాలలలో చదువు చెప్పించుట కిష్టపడలేదు. అదియతనికి చిన్నతన మనిపించినది. అందువల్ల అయిదేండ్ల వయస్సుగల అరవిందుని డార్జిలింగులోని ఒక మిషనరీ పాఠశాలకు

పంపించి అచ్చటనే ఎ. బి. సి. డి. లతో అతనికి అక్షరాభ్యాసము చేయించినాడు. అప్పటికీ తృప్తిపడక రెండేండ్లు గడచునప్పటికి యావత్తు కుటుంబముతో బయలుదేరి ఇంగ్లాండునకు వెళ్ళినాడు. అరవిందునివిద్యాభ్యాసమంతయు ఇచ్చటనే జరిగినది. కారణాంతరాలవల్ల తండ్రి స్వదేశానికి తిరిగి వచ్చినప్పటికీ అరవిందుడు ఇంగ్లాండులోనే ఉండిపోయెను. అతని విద్యార్థిదశయావత్తు పాశ్చాత్యవాసనతోనే నిండిపోయెను.

సీమలో అరవిందుడు పదేండ్లు పాటు విద్యాభ్యాస మొనర్చి ఆంగ్ల భాషతో పాటు ఫ్రెంచి, లాటిన్, గ్రీకు, మున్నగు భాషలను గూడ ఆపోశనబట్టెను, తరువాత ఐ. సి. యస్. పరీక్షకు గూడ చదివి అందులో ప్రథమ శ్రేణియందు త్తీర్ణుడయ్యెను.

ఆదేసమయములో భారతదేశ స్వాతంత్ర్యము నిమిత్తము అచ్చటనే కృషిచేయుచున్న భారత యువకులతో నతనికి పరిచయము గలిగెను. ఆపరిచయము క్రమక్రమముగా గాఢమై అరవిందుని హృదయములో మాతృదేశాభి మానమును రేకెత్తించెను. ఆయభిమానము తీవ్రతరమై ఒక విధమైన ఆర్తితో గూడిన ఆవేదనగా అతనిలో పరిణమించెను. ఇక చెప్పనదేమున్నది? అతడు తనవిద్యాభ్యాసము నకు తనకు లభింపనున్న ఉన్నతోద్యోగమునకు స్వస్తిచెప్పి మాతృదేశవిముక్తికిబద్ధకంకణుడయ్యెను. బ్రిటిషుదొరతనముక్రింద ఉద్యోగముచేయుట పాపిని లక్షణమని నిరసించెను. తండ్రితో వ్యతిరేకించి ధనాభావము వల్ల ఎన్నోకష్టాలకు లోనయ్యెను. అయినప్పటికీ అతని నిశ్చయము సళ్ళలేదు.

ఇట్లు చెప్పరాని కష్టాలకులోనై ఇంగ్లాండులో ఉన్నసమయాన - 1892 లో దేశానికివచ్చిన బరోడామహారాజు అరవిందుని ఆదరించి, తనతోబాటు స్వదేశానికి తీసుకొనివచ్చి, తన సంస్థానములో గొప్పయుద్యోగమిచ్చెను. అది రుచింపక అరవిందుడు కొంతకాలము మహారాజునకు ఆంతరంగిక కార్యదర్శిగా పనిచేసి, అదియు రుచింపక చివరకు కళాశాలలో అధ్యాపకవృత్తినిస్వీకరించెను. ఈ పదవిలో అయన పదుమూడుసంవత్సరాలు పనిచేసెను.

ఈ యధ్యాపకవృత్తిలో నున్న కాలములోనే అరవిందుడు భారత విజ్ఞానమహిమను, భారత సంస్కృతిని, అవధులుదాటిపోయిన ఆధ్యాత్మికోన్నతిని, సమస్తప్రపంచానికి వెలుగుదారులు చూపించిన పవిత్రఋషివాణిని, గ్రహింపగలిగినాడు. మొదటినుండియుఆంగ్ల వాతావరణములో పెరిగినవాడగుటచేత నతనికిదేశసంప్రదాయములు గాని, దేశభాషలుగాని, తెలియనే తెలియవు. జన్మతః వంగదేశీయుడైనను ఆయనకు వంగభాషకూడరాదు. ఈలోటును అరవిందుడు అచిరకాలములోనే గ్రహించి గట్టిపట్టుదలతో గుజరాతీ, మరాటీ, హిందీ, బెంగాలీ, మున్నగు దేశభాషల నభ్యసించి తగినంత పాండిత్యమును గడించెను. సంస్కృతభాషనుగూడ కూలంకషముగానభ్యసించెను. ఇప్పటికి భారతదేశ నిజస్వరూపమెట్టిదో, భారతసంస్కృతియొక్క విశిష్టత యెట్టిదో, భారతవిజ్ఞాన మహిమయెట్టిదో, ఆయనకు చక్కగా బోధపడినవి.

బరోడావాసము ముగిసిన తర్వాత అరవిందుడు కలకత్తాకువెళ్ళి బెంగాల్ నేషనల్ కాలేజీకి ప్రిన్సిపాలుగా పనిచేయ

నారంభించెను. ఈ సమయములోనే రాజకీయాలలో ప్రవేశించి వంగదేశవిభజనకు వ్యతిరేకముగా ఆందోళనలేవదీసి "వందేమాతరం" పత్రికకు తొలి సంపాదకుడయ్యెను. మితవాదుల చేతులలో నున్న నేషనల్ కాంగ్రెసు సంస్థను నిశితముగా విమర్శించుచు, అతివాదియై విప్లవకారుడయ్యెను. ఈయన వ్యాసాలు, విమర్శలు, ఉపన్యాసాలు, బ్రిటిషు ప్రభుత్వాన్ని కలవరపెట్టెను. అప్పటినుంచి తెల్లవారికన్ను ఈయనమీద పడెను. చివరకు ఆలీపూరు బాంబు కేసులో నేరము మోపబడి అరవిందుడు కారాగారమునునిర్బంధింపబడెను.

1908లో తనకుగలిగిన యీనిర్బంధము వల్ల తృటికాలము విశ్వాసము చలించి "నాకు ఈవిధముగా జరిగినదేమి? నాప్రజలకు - నాదేశానికి - సేవచేయాలని అనుకొన్నానే? ఆసేవ పూర్తిఅయ్యే వఱకు నీఅండదండలు నాకుఉండగలవని అనుకొన్నానే? మాతా! ఈనేరమేమిటి? నేనీ చెఱలో ఉండుటేమిటి?" అనియావేదనతో కూడిన ఒక మూకప్రార్థనను ఆయన కావించినాడు. అందుకు సమాధానముగా "ఇది నీరంగముకాదు. ఏకాంతానికి వెళ్ళి అంతర్వీక్షణమును జరుపుము. ఇప్పుడు నీవుచేస్తున్న పని నీవులేనిదే సాగదని అనుకోకు. ఈపనిచేసేవారు వేరే ఉన్నారు. ఇప్పటికైనా తెలివితెచ్చుకొని యేకాంతానికిపో" అని ఒకయంతర్వాణి చెప్పినట్లయింది. అరవిందునకా ప్రబోధమువల్ల జ్ఞానోదయమైనది.

ఒక నెలరోజులు అరవిందుడు కారాగారవాస మొనర్చినాడు. ఆకేసులో చిత్తరంజనదాసు అరవిందుని తరఫున వాదించుటచేత నిర్దోషిగా ఆయన విడుదలచేయబడినాడు. బయటికి వచ్చినప్పటికి జైలులో వినబడిన ఆయంతర్వాణి ప్రబోధ మింకను ఆయన చెవులలో మాఱుమ్రోగుచునే యున్నది. నిజానికి జైలులో ఉండగనే ఆయన సాధన ప్రారంభ మయింది, ఈ యంశమును గుఱించి "ఉత్తరపారా" లో ఇచ్చిన యుపన్యాసములో ఆయన వివరించినాడు.

1910లో తిరిగి అరవిందుని నిర్బంధానికి వారంటు జారీ చెయ్యబడింది కాని యెందుకో ఉపసంహరింప బడినది. ఇక రాజకీయ రంగమునుండి తప్పుకొని మాతృనాదేశప్రకారము ఏకాంతానికి వెళ్ళుటకు నిశ్చయించుకొని, అరవిందుడు బ్రిటీషువారి వాసనలేని పుదుచ్చేరినగరానికి వెళ్ళి తన ఆశ్రమాన్ని నెలకొల్పినాడు. నాటినుండి కడచిన డిశంబరునెల 5వ తేదీవఱకు ఆయన పుదుచ్చేరిలోనేయుండి ఏకాంతముగా సాధనచేయుచు అంతర్వీక్షణమును కొనసాగించినాడు. ఆయన సాగించినసాధన ఒకవ్యక్తిని గుఱించికాదు. ఒకసంఘమును గుఱించికాదు. ఒకజాతిని గుఱించికాదు. ఒకదేశమును గుఱించికాదు. ఒకఖండమును గుఱించికాదు. ఆసాధనలోని సారాంశమిది.

"అన్నిమతాలను, అన్నిశాస్త్రాలను,
అన్నిసిద్ధాంతాలను, అన్నిధర్మాలను,
సమన్వయపఱచి, మానవాళిని
ఏకాత్మగాచేయగల శాశ్వతధర్మాన్ని,
జగత్సర్వపు భావిమతాన్ని, ఆతల్లి
ప్రసాదించుగాక!"

ఈనాడు వసుధైక ప్రపంచమనీ, మానవజాతిఅంతా ఒక్కటేయనీ, చెప్పువారంద

త్తికి ఇది తిరుమంత్రము. ఇంతకంటె మానవుడు చేయదగిన ఉత్తమోత్తమ సాధన మఱొకటి లేదు. అరవిందుని సాధనల్లో నింతటి పరమార్థ ముండుటచేతనే ఆయన అమృత సందేశాని వినుటకు ఖండఖండాల వారు పుదుచ్చేరికి పరువులెత్తి వచ్చినారు.

అరవిందుడు సాగించిన సాధనమహత్తరమైనది. మహోన్నత మైనది. 1926 నవంబరు 24 వ తేదీ ఈయన జీవితములో అతి ముఖ్యమైనరోజు. ఆనాడు ఆయనసాధనయందొక మహత్తరమైన సంఘటన జరిగినదనిచెప్పెదరు. ఆరోజునుండియే ఆయన తనశిష్యులకుగూడ దర్శనమీయక పరోక్షముగా ఏకాంతవాసం గడిపారు. ద్వంద్వములకు త్రిగుణములకు, అతీతమైన అధికాధికోన్నతతమమైన – కృష్ణ శ్రీకృష్ణావతారములో నెలకొనబడినదనీ, అరవిందుడానాడు ఆకృష్ణునందుకొని ద్వంద్వాతీతుండు – త్రిగుణాతీతుండు – అయినాడని చెప్పెదరు.

ఆయన యోగమహిమ – తపోదీప్తి యెట్టివో చెప్పుటకు ఆయన పరమపదించిన తరువాత జరిగిన సంఘటనలే చాలును. ఆ సిద్ధపురుషుని మృతశరీరము నూట పదకొండు గంటలకాలము చెక్కు చెదరక కాంతులు గ్రక్కినదంటే ఆయోగమహిమ యెట్టిదోయూహింపుడు. ఆమృతశరీరమును దర్శించిన వారికి ఒకవిధమైన తేజస్సు,శక్తి, లభించిన వంటే ఆతపోదీప్తియెట్టిదో భావింపుడు. ఆమహనీయుడు నేడు మనకు శారీరకముగా లేకపోయినప్పటికీ ఆయన పవిత్రాత్మ మనకు తోడునీడై దారిచూపుగాక! మారణయంత్రాలతో మృత్యోన్ముఖమైయున్న నేటిప్రపంచానికి ఆయన పవిత్ర సాధన సుస్థిరశాంతి సౌఖ్యాలను చేకూర్చుగాక !! ఆయన యద్వితీయతపశ్శక్తి భారత దేశాభ్యుదయానికి సర్వతో ముఖముగా ఉపకరించుగాక!!!

ఓం శాంతిః శాంతిః శాంతిః

—సంపాదకుడు.

## 1. మద్రాసు ప్రాథమిక విద్యాశాసనము (Madras Ele. End. Act) లోని నిబంధనలకు సవరణ.

(G. O. 2097—ది 21-7-1950)

పైని పేర్కొనబడిన నిబంధనలో "సెక్షను 3 (XIII)-బడియీడు" అను శీర్షిక క్రింది నిబంధనకు బదులుగా యీ క్రిందిది పొందుపరచవలెను.

"బడియీడు" అనగా విద్యార్థి లేక విద్యార్థినికి, ఆఱవయేడు వచ్చిన తేదీనుండి ప్రాథమిక పాఠశాలల లోని ఐదవతరగతి గాని, సెకండరీ పాఠశాలలలోని ఐదవక్లాసుకాని, పూర్తిచేసిన తేదీగాని, లేక విద్యార్థి లేక విద్యార్థిని 12 సంవత్సరములుపూర్తిచేసిన తేదీగాని, యిందు యేతేదీ ముందు పూర్తిఅయిన ఆ తేదీవరకు గల కాలము అని గుర్తించవలెను.

కాని మద్రాసుప్రభుత్వమువారి యామోదమునకు లోబడి డైరెక్టరుగారు యీబడియీడు కాలమును వివిధ వర్ణముల ప్రత్యేకతలనుబట్టి వివిధవిధములుగ నిర్ణయింపవచ్చును.

అట్లే ది 1-8-1945 నుండి ఆరుసంవత్సరముల కాలమువరకు జిల్లాబోర్డువారి యధీనములో నుండి నిర్బంధ ప్రాథమికవిద్య నమలుపఱచబడిన స్థలములందుమాత్రము "బడియీడు" అవధి బాలురకు 14 సంవత్సరములవరకు బాలికలకు 12 సంవత్సరముల వరకును యుండును.

ఇదిగాక పైన వివరించబడిన బడియీడు కాలము ఎంతవరకుయున్ననూ ఏబాలునిగాని, బాలికనుగాని, ఆరు సంవత్సరములకంటె ఎక్కువకాలము నిర్బంధించరాదు.

వివరణ:—ఒక విద్యార్థికి బడియేడు (School year) మధ్యకాలములో ఆరు సంవత్సరములు నిండినప్పటికిని రికగ్నిషను నిబంధనలలోని అడ్మిషనురూల్సు ప్రకారము ఆ తరువాత వచ్చు అడ్మిషను తేదీ నుండియే బడియీడు ప్రారంభించబడును. అట్లే బడియేడు మధ్యలో బడియీడు ఆఅవధిముగిసిననూ ఆ బడి యేడు అంతమువరకును బడియీడు క్రిందనే పరిగణించబడును.

## 2. మద్రాసు విద్యానిబంధనలకు (M. E. R.) సవరణలు.

(i)

(విద్యాశాఖకు చెందిన G. O. Ms. No. 2674D/26-9-1950. మద్రాసు విద్యానిబంధనలలోని **154** వ నిబంధనకు బదులుగా యీ క్రిందిది పొందుపఱచవలెను.

"154. జిల్లా విద్యాశాఖాధికారి యధీనములోనున్న పాఠశాలలలోని యేగ్రేడునకుచెందిన యుపాధ్యాయుని యోగ్యతాపత్రమునైననూ (Teachers Certificate) ఆ యుపాధ్యాయుని శీలము లేక నడవడి చెడుగాయున్నప్పుడునూ లేక ఆ యుపాధ్యాయుడు విద్రోహచర్యలలో పాల్గొనుచున్నట్లు లేదా సంబంధమున్నట్లు ఋజువైననూ, డివిజనల్ యినస్పెక్టరుగారిచే సస్పెండు చేయబడవచ్చును. ఇట్టిసందర్భము లందే డైరెక్టరుగారికి సస్పెండుచేయుటకును కాన్సిల్ (Cancel) చేయుటకునుకూడ యధికారము కలదు. కాని యిట్టి సస్పెన్షనుకాని కాన్సిలేషనుకాని ఆయుపాధ్యాయుడు న్యాయస్థానములో నేరస్తుడుగా పరిగణించబడినప్పుడు తప్ప యితరసందర్భములలో ఆతనికి ముందుగా వ్రాతపూర్వకముగా తెలియపఱచి డివిజనల్ యినస్పెక్టరుగారిచేగాని డైరెక్టరుగారిచేగాని లేక అధికారముపొందిన మరొకరిచేగాని సక్రమమైన సమగ్రవిచారణ జరుపబడనిదే ఉత్తరువులు పంపవీలుపడదు."

(ii)

(విద్యాశాఖకు చెందిన జి. ఓ. 2737 ది 3—10—50)

మద్రాసు విద్యానిబంధనలలోని "13 వ నిబంధనయందలి 5వ పేరా"కు బదులు యీ క్రిందిది పొందు పఱచవలెను.

"5. పాఠశాలలో సంగీతోపాధ్యాయులను నియోగించుటకు ఉండవలసిన యోగ్యతలలో మద్రాసు విశ్వవిద్యాలయమువారి భారతీయసంగీతపుఉపాధ్యాయినిగాని, "సంగీతశిరోమణి" యనుబిరుదుగాని, మూడవ పార్టులో భారతీయ సంగీతపుయోగ్యతతో కూడిన బి ఏ. డిగ్రీకాని, అన్నామలై విశ్వవిద్యాలయమువారి "సంగీతభూషణ" అను బిరుదుగాని యుండవలెను. ఇట్టివారికి ఇంకనూ హయ్యర్ గ్రేడుకు చెందిన సాంకేతికోపాధ్యాయ పత్రముగాని (Technical Teacher's Certificate Highe-[Grade) లేక ఏ గ్రేడునకు చెందినదైననూ ఉపాధ్యాయపత్రము (Tra'ned Teacher's Certificate) గాని యున్న ప్రథమ ప్రాముఖ్యత (Frist Preference) నీయవలెను. లేదా S. S. L. C. పూర్తిచేసిన యోగ్యతతో భారతీయసంగీతములో ఉపాధ్యాయపత్రము కలిగియున్నవారైననూ నియమింపవచ్చును.

## 3. ప్రాథమిక పాఠశాలల ప్రభుత్వామోదము, (Recognition) ప్రభుత్వసహాయ్యముల (Grant in-aid) నిబంధనలకు సవరణలు.

(i)

(విద్యాశాఖకు చెందిన జి. ఓ. 2691-ది 26-9-1850.)

I అధ్యాయము - ప్రభుత్వామోద నిబంధనలు - నిబంధన 12-A. (ఈ నిబంధనమే యిపుడు 12-B అని వ్యవహరించ బడుచున్నది.)

"ప్రయివేటు మేనేజిమెంటు క్రిందయున్న ప్రాథమికపాఠశాలల మేనేజరు విద్యావంతుడును, దేశమున విద్యాభివృద్ధిని జరుపవలెననెడి యభిలాషకలవాడును, అయి యుండవలెను. ఆస్తి పాస్తులు కలిగి యుండవలెను. యూనియను ప్రభుత్వము తరపునగాని స్టేటు ప్రభుత్వము తరపునగాని, లోకల్ బోర్డు తరపునగాని, పనిచేయు యావత్కాల ఉద్యోగి (Whold-time servant) గా నుండరాదు. అతడు బడియున్న తాలూకాకు సంబంధించిన ప్రదేశములోనే నివసించువాడై యుండవలెను. ప్రత్యేకసందర్భములలో యిందుకు భిన్నమైనపుడు మద్రాసుపట్టణమునకు మద్రాసు డి. ఇ. ఓ గారిచేతను, మిగిలిన ప్రదేశములకు డివిజనల్ ఇనస్పెక్టరుగారిచేతను, ఒక సంవత్సర కాలమునకు మాత్రము ప్రత్యేక మేనేజరుగారి పేద ఎజంప్షను పొందవచ్చును. ఈ నిబంధన ది 1-4-51 నుండి అమలులోనికి వచ్చును.

ii

(G. O. 2962. Edn. dated 3-9-50.)

పై అధ్యాయములోని నిబంధన 13 (2) లోని (vi) వక్లాజులో ఈ క్రిందిది చేర్పుము.

"పాఠశాల మేనేజిమెంటు తన పాఠశాలలో పనిచేయుట పర్మనెంటు, లేదా టెంపరరీ, యుపాధ్యాయునైననూ అవిధేయత దుసలము, మానసిక అయోగ్యత, మొదలగు కారణములపై మూడు మాసములకు మించని కాలమువరకు సస్పెండు చేయవచ్చును. అట్లు చేసినపుడు వెంటనే రిజిష్టరు టపాద్వారా ఆ విషయమును డిప్యూటీ యినస్పెక్టరు గారికి తెలుపవలెను. అయితే డి.ఇ. ఓ. గారు పరిశీలించినతరువాత అట్టి సస్పెంషను అక్రమమని తేలినచో మేనేజిమెంటువారే సస్పెంషను కాలమునకగు జీతమును భరించుకొని, సస్పెంషను కాలమును పనియందున్నట్లుగనే భరించుకొనవలసి యుండును.

(iii)

(G. O. 3017-Education dated 11-11-50)

## అధ్యాయము II - ప్రభుత్వద్రవ్యసహాయ నిబంధనలు

నిబంధన 1:—— ఈ నిబంధనలో హైయ్యర్ ఎలిమెంటరీగ్రేడు ఉపాధ్యాయునకు, పాతస్కేలుస్థానమున రివైజుడు స్కేలు ది 1-4-1950 నుండి రు 27—½—30" అనిచేర్చవలెను.

ఈ నిబంధనక్రింద యిచ్చిన షరా (1) లో యీ క్రిందివిషయములు చేర్చవలెను.

"హయ్యర్ ఎలిమెంటరీగ్రేడు ఉపాధ్యాయులకు ది 1-4-1950 నుండి క్రొత్తస్కేలు ప్రకారము జీతము లెక్కగట్టవలసి యున్నప్పటికిని, మేనేజిమెంటువారు యుపాధ్యాయున కొక్కక్కనికి నెలకు మూడురూపాయల చొప్పున యిచ్చుకొనవలెను. ఉపాధ్యాయుల జీతము క్రమముగా పెరిగి 30 రూపా

యలవరకు పెరిగిననూ, మేనేజమెంటువారు మాత్రము వారివ్వవలసిన మూడురూపాయ లివ్వక తప్పదు. ప్రత్యేక మేనేజిమెంట్లకు, ప్రత్యేక పరిస్థితులందు, ఆర్థికస్థితి దృష్ట్యా ఒక సంవత్సరకాలమువరకు డివిజనల్ ఇనస్పెక్టరుగారు, ఎగ్జంషను యివ్వవచ్చును. కాని అటుపైన మేనేజిమెంట్లు పైమొత్తమును వారి యుపాధ్యాయుల కివ్వకున్న అట్టి పాఠశాలల రికగ్నిషను తొలగించబడును.''

## (iv)

## (G. O. 2962, Edn. dated 3–11–50)

అదే అధ్యాయములో నిబంధన 4 (5) —

మొదటిపేరా చివర ఈక్రిందిది చేర్చవలెను.

''మేనేజిమెంటువారు తమపాఠశాలలోని యేయుపాధ్యాయునికైనను అతనిస్కేలు గ్రాంటుకంటె అదనపు జీతము నిచ్చుచున్నయెడల, అతను వాడుకొను సెలవులలో యిచ్చుజీతము విషయములో, అతనికి మామూలుగా యిచ్చురేటు ప్రకారముగాగాని, లేక స్కేలుగ్రాంటు ప్రకారము యిచ్చుటకుగాని, మేనేజిమెంటువారి యిష్టమునకే వదలి వేయడమైనది.''

ఇంతలి సబ్ పేరాగ్రాఫ్‌లో ''ఒకనెల'' అనియున్నమాటకు బదులు ''రెండునెలలు'' అని చదువుకొని, చిట్టచివర యీక్రింది పేరా చేర్చవలెను.

''తన పాఠశాలలోని వివాహిత స్త్రీలకు ప్రసవకాలమునమాతృత్వపుసెలవు (**Maternity leave**) పూర్తిగ్రాంటుపై రెండుమాసముల వ్యవధి వరకు మేనేజరు మంజూరుచేయవచ్చును. పర్మనెంటుకాని యుపాధ్యాయినులకు, వారికియున్న యితరసెలవుల మేరకు యివ్వవచ్చును. అయితే పర్మనెంటుకాని యే యుపాధ్యాయినికైననూ, ఎట్టియితరశలవైననూ, లేనిపక్షమున లేదా ఆమెకున్న సెలవు రెండుమాసములకు తక్కువైన, రెండుమాసముల వ్యవధిమేరకు ఆమెకు సెలవుమంజూరు చేయుచూ, ఆమెకున్న సెలవుపోను మిగిలినది మాతృత్వపు సెలవుగా పరిగణించవలెను.''

## (v)

## (G. O. 2753 Education dated 4 – 10 – 1950)

అధ్యాయము II ప్రభుత్వ ద్రవ్యసహాయము–టీచింగు గ్రాంటులు.

నిబంధన 22 లో ఇదివరకున్నది తీసివైచి ఈక్రిందిది చేర్చవలెను.

''2 పాఠశాలలకు గ్రాంట్లు పంపుట: —పాఠశాలకు యివ్వవలసిన కరువుభత్యములతో సహా టీచింగుగ్రాంట్లు నెలవారిగా క్రిందిపేర్కొనబడిన విధమున పంపబడును. పాఠశాలల కివ్వవలసిన నిర్వహణ ద్రవ్యములు ( aintenance grants) మాత్రము సంవత్సరమున కొకేసారి ఫిబ్రవరినెలలో టీచింగు గ్రాంటుతోపాటు పంపబడును.

మాసాంతము కాగానే మరుసటినెల 10వ తేదీలోగా మేనేజిమెంట్లు వారిపాఠశాలల నెలసరిలెక్కలను డెప్యూటీ యినస్పెక్టరువారి ఆఫీసునకు పంపవలెను. డెప్యూటీ యినస్పెక్టర్లు నెలసరి లెక్కలను పరిశీలించిన తరువాత పాఠశాలల కివ్వవలసిన నెలసరి గ్రాంటులను సిఫారసుచేయుచూ ఆ నెల 20 వ తేదీలోగా డి. ఇ. ఓ. లకు పంపవలెను. డి. ఇ ఓ. లు పునఃపరిశీలనానంతరము మరుసటినెల మొదటి వారములోగా లెక్క ప్రకారము గ్రాంటులు పంపు ఏర్పాట్లు చేయవలెను. డి. ఇ. ఓ. లు పంపు గ్రాంటు బిల్లులు ప్రత్యేకముగా టీచింగుగ్రాంటు, కరువుభత్యము, నిర్వహణ భత్యముల వివరములతోకూడి ప్రతియొక్క స్కూలునకు లేక ఒకే మేనేజిమెంటుక్రిందయున్న వివిధ పాఠశాలలకుగాను ఆయా మేనేజరులకు అనుబంధము IX లో యీయబడిన నియమిత ఫారములో పంపబడవలెను.

మద్రాసు నగరము, జిల్లా కేంద్రములు, తాలూకా కేంద్రములలోయున్న పాఠశాలలకును రు 200 లకు మించి గ్రాంటునుపొందు ఇతర స్థలములందలి పాఠశాలలకును గ్రాంట్లు ఆయా ట్రెజరీ బిల్లులద్వారా పంపబడును. ఈ పై మొత్తమునకు తక్కువైన గ్రాంటులనుపొందు యితర స్థలములందలి పాఠశాలలకు మాత్రము గ్రాంట్లు మనియార్డరుద్వారా పంపబడును.

గ్రాంటు బిల్లులు పంపుటకగు తపాలా ఛార్జీలను, మనియార్డరు కమీషనులును మేనేజిమెంటువారే భరించవలెను. కనుక ఆ మొత్తములు వారి గ్రాంటులనుండి తగ్గించబడును. మేనేజిమెంటువారు ఆ ఖర్చులను మేనేజిమెంటువారి నిర్వహణ భత్యములు, ప్రత్యేక ఉపాధ్యాయుల జీతముల నిష్పత్తిలోసక్రమముగపంచి, మిగిలిన మొత్తమునే యుపాధ్యాయుల కీయవలెను.

వివిధ మాసములలో జరుగు గ్రాంట్ల పంపకము వివరము లీక్రింద యీయబడినవి.

| | | | |
|---|---|---|---|
| జనవరి | —గ్రాంట్లు పంపబడవు. | జూన్ | —ఏప్రిల్ నెల గ్రాంటు. |
| ఫిబ్రవరి | —గత నవంబరు, డిసెంబరుల టీచింగు గ్రాంటును, నిర్వహణ భత్యముల మొత్తములును కలిపి సాలుసరి గ్రాంటు. | జూలై | —మేనెల గ్రాంటు. |
| | | ఆగస్టు | —జూన్ నెల గ్రాంటు. |
| | | సెప్టెంబరు | —జూలై నెల గ్రాంటు. |
| మార్చి | —జనవరీనెల గ్రాంటు. | అక్టోబరు | —ఆగస్టునెల గ్రాంటు. |
| ఏప్రిల్ | —ఫిబ్రవరినెల గ్రాంటు. | నవంబరు | —సెప్టెంబరునెల గ్రాంటు. |
| మే | —మార్చినెల గ్రాంటు. | డిశంబరు | —అక్టోబరునెల గ్రాంటు. |

### అధ్యాయము II లోని నిబంధన 26

ఈ నిబంధనలోని "నెలలోని 15 వ తేది" అనుచోట "నెలలోని 10 వ తేది" అని చదువుకొనవలెను

### vi

### (G. O. 2870 **Education Dated** 17-10-50)

### అధ్యాయము III — పాఠశాల భవనములు, స్థలములు, ఆటస్థలములకు గ్రాంటులు

నిబంధన 8 : బావులు త్రవ్వుటకు ద్రవ్యసహాయములు - మొదటివాక్యము తరువాత యీ క్రిందిది చేర్చుకొనవలెను.

"మేనేజిమెంటువారు పాఠశాల అవసరములకు సరిపడు కొద్దిపాటి బావులను మాత్రమే త్రవ్వించవలెను. ఒక్కొక్క బావికై యిచ్చు ప్రభుత్వ ద్రవ్యసహాయము 500 రూపాయలవరకు మితమై యుండును.

---

## వివేక ప్రశ్నలు

పంచవర్ణాల నామంబు పరగు నాకు ;
ఆది రెండును వల్మీక మగును ; తుదివి
ఆత పత్రమునకుఁ జెల్లు ; అర్థ మెఱిఁగి
చెప్పుడీ నాదుపేరేమొ ? తప్పులేక.

సి. హెచ్. విశ్వనాథం - హెడ్మాష్టరు - అక్కుపల్లి.

నాల్గు వర్ణాలతో నొప్పు నాదుపేరు ;
ఆది యంత్యాలు గలిసి శోకార్థ మిచ్చు ;
క్షీరమగు రెండుమూడును జేర్చపలుక ;
విశ్వపురుషుఁడ నేను ; నాపేరు చెపుడు.

పూస రామస్వామి - హెడ్మాష్టరు - లోచర్ల ధరిపణుకువలస.

---

# నవంబరు - డిశంబరునెలల చిత్రప్రశ్నలు

(1950 సం॥ నవంబరు, డిశంబరు సంచికలలో ప్రకటింపబడిన)

## వివేకప్రశ్నలు

అను చిత్రప్రశ్నలకు సమాధానములు

౧. నీహారము. ౨. సరస్వతి. ౩. తూనీగ.

* * *

చందా నెం. మొదటి రెండు ప్రశ్నలకు సరియైన సమాధానములు పంపినవారు—

381 కొత్తూరు సుబ్బారావుగారు - టీచరు - కసిమికోట.

మొదటి ప్రశ్నకు మాత్రమే—

470 కలిదిండి సత్యనారాయణరాజుగారు - టీచరు - మొయిద.

గన్నవరపు శ్రీరామమూర్తిగారు - హెడ్మాష్టరు - చెల్లిగానివలస.

అనపర్తి కౌశయ్యగారు - చెల్లిగానివలస.

368 అల్లంరాజు బంగారంగారు - శంఖవరము.

---

# ప్రకటన

భక్తాగ్రేసరులారా!

శ్రీశైలమహాక్షేత్రమునకు ముఖ్యస్థానమైనట్టియు, మహారణ్యములో నున్నట్టియు, శిఖరేశ్వరమువద్ద మహాశివరాత్రి సందర్భమున పదిరోజులు అన్నివర్ణములవారికి అన్నదానము జరుపుచుంటిమి. ఈ యన్నసత్రమునకు షుమారు 50 బస్తాల బియ్యము కావలెను. ఇది భక్తులసహాయముతో జరుగుచున్నది. కాన యావన్మంది తమ శక్తి కొలది చందాలను ఈ దిగువ చిరునామాకు మనియార్డరుద్వారా పంపి, యీ మహత్కార్యమునకు సహాయపడి శ్రీ భ్రమరాంబా మల్లేశ్వరుల కృపకు పాత్రులు కాగోరుచున్నాను.

కంభం
కర్నూలు జిల్లా.

ఇట్లు,
సర్వజన విధేయుడు
**డి. వి. రమణమూర్తి.**
ఆర్గనైజరు - శ్రీశైలశిఖరేశ్వర అన్నసత్రం.

---

# నవోపాధ్యాయ పరిషత్తు



కె. కృష్ణారావు
టీచరు
వేపగుంట.

సాలూరురేంజీ పాచిపెంటలో "నవోపాధ్యాయ పరిషత్" గలదని నే నిదివరకే పత్రికలో చూచాను. చూచినదిమొదలు యీ పరిషత్ ఉద్దేశాలేమో తెలిసికోవాలని కుతూహలపడేవాణ్ణి. ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యకు వ్రాసి, పూర్తి వివరాలు కనుగొనాలనుకొన్నాను. ఆ ఉత్సాహం ఉప్పొంగి వేపగుంట గ్రామంలోయున్న నన్ను సాలూరు రేంజీ పాచిపెంటలో నిల్పింది నా ఆనందదేవత.

పరిషత్ కార్యదర్శి పి. వి. సీతారామపాత్రోగారిని ఆ. రా. ప్రా. విద్యలో చూచాను. ఆ పాత్రో గారివద్దకు వెళ్ళాను. నన్నెంతో గౌరవించారు. పిమ్మట పరిషత్ యొక్క సభ్యులందరినీ చూపించారు. అందరూ 20 **to** 25 వత్సరాల వయస్సుగల యువజనోపాధ్యాయులే! అందులో చిలకలపల్లి రామారావు గారు అధ్యక్షులనియు, పాత్రోగారు కార్యదర్శి యనియు, పి. వి. సుదర్శనరావుగారు సహాయకార్యదర్శి యనియు, తెలుసుకున్నాను.

ఐతే ఈ పరిషత్ వారి ఉద్దేశాలను తెల్పమని అధ్యక్షుని కోరాను. మేము కొన్ని మంచి పత్రికలు తెప్పించి చదువుచున్నామనియు, ఆ పత్రికలకు వ్యాసములు, కథలు, గేయములు, పద్యములు, పంపిస్తున్నామనియు, గ్రామసీమలలోని నిరక్షరకుక్షులకు చైతన్యము కలిగించేటందుకు నాటకాలు ప్రదర్శిస్తున్నామనియు, విద్యార్థులకు ఉల్లాసము కలిగించు "నవభారతి" అను వ్రాత మాసపత్రిక నడుపుచున్నామనియు, మహానాయకుల జీవితగాథలను అప్పుడప్పుడుపన్యసించుచున్నామనియు, గాంధీ జయంతి, వర్ధంతి, రిపబ్లిక్, స్వాతంత్ర్యదినాల్లో ఉల్లాసంగా పరిషత్ వారము పాల్గొంటున్నామనియు తెల్పిరి. 1950 జనవరి 26 తేదీని పాత్రోగారు వ్రాసిన "దేశసేవ" నాటకాన్ని ప్రదర్శించి ప్రజల రంజింపజేశారట! పిమ్మట 1. నిరుద్యోగి 2. పతివ్రత అను రెండు నాటకములు ప్రదర్శించారట. యీ మూడు నాటకాల్లో నాయకపాత్ర **Ch.** రామారావుగారు ధరించారు. నేనున్న రెండుమూడుదినాల్లో "మొద్దబ్బాయి" నాటకము రిహార్సల్ జరిపారు. మొద్దబ్బాయిపాత్రను పాత్రోగారు ధరించారు. రంగడుపాత్ర సుదర్శనంగారు, మొద్దబ్బాయితండ్రి పాత్ర రామారావుగారు ధరించారు. ఈ నాటకం విద్యావ్యాప్తి కెంతైనా వుపకరిస్తుంది. పల్లెప్రజల మనస్సులు కరగించి ఉపాధ్యాయులపై ఆదరణ కలిగిస్తుందని నేను గట్టిగా చెప్పగలను, పాచిపెంట పెద్ద గ్రామమైనను సంస్కరణాభిలాషులు లేనందున "స్త్రీ" పాత్రను పురుషులే ధరిస్తున్నారనియు, సోదరీమణులెవరైనా స్వార్థమునువీడి నడిపిస్తామంటే వారిని మేము, మా సోదరీమతల్లులువలె భావించి ఆహ్వానిస్తామనియు పరిషత్ వారన్నారు. వారభిలాష నెరవేరలేదుకదాయని నేనుకూడా చింతించాను. వారి మర్యాదలను స్వీకరించి నా గ్రామం వచ్చాను. పత్రికలద్వారా, నాటకములద్వారా ప్రచారపూర్వకంగా దేశసేవ చేస్తున్న నవోపాధ్యాయపరిషత్ యింకా అభివృద్ధిపొందుగాత! అని దేవుని ప్రార్థించుచూ యీ పత్రిక ద్వారా పరిషత్ వారిని అభినందించుచున్నాను.

జై హింద్!




# సర్దార్ వల్లభభాయ్ పటేలు స్మృతికి సానుభూతి సభలు

## రావికమతం!

15-12-1950 వ తేదీ సాయంకాలము బాలసారస్వత సమితివారిచే భారత ప్రభుత్వ ఉపప్రధాని స్మృతికి సంతాపసభ శ్రీ రాచకొండ సత్యనారాయణగారి అధ్యక్షతక్రింద జరుపబడెను. పటేలుగారి ఆత్మ శాంతికి భగవత్ప్రార్ధనలు గావింపబడెను.

— రా. నారాయణమూర్తి.

## పాచిపెంట:

ఈ గ్రామ కేంద్రోపాధ్యాయ సంఘమువారిచే ది 16-12-50 న శ్రీ ఎ. కాశీపతరావు పంతులుగారి ఆధ్వర్యమున ఉపప్రధాని నిర్యాణమునకు సానుభూతిసభ జరిగెను. పటేలుగారి ప్రతిభావిశేషములనుగూర్చి శ్రీ పట్నాయకుని సూర్యనారాయణ (దేశసేవక్) గారు ఉపన్యసించిరి.

— పి. వి. శీతారామ శాస్త్రో.

## యానంపేట:

ది 15-12-50 మధ్యాహ్నం రెండు గంటలకు భారత ఉపప్రధాని సర్దార్ వల్లభభాయ్ పటేలుగారి స్మృతికి సంతాప సానుభూతులు తెలుపుటకుగాను గ్రామ నాయుడుగారి ఆధ్వర్యమున గొప్ప ఊరేగింపు అతి విచారకరముగా జరిగెను. వేణమ్మపేట, అక్కులుపేట గ్రామస్థులుకూడవచ్చి యిందులో పాల్గొనిరి. పిమ్మట యానంపేట ఎలిమెంటరీస్కూలు మైదానములో 3 గంటలకు శ్రీ మునగవలస రంగారావుగారి అధ్యక్షతక్రింద సభ జరిగెను. పటేలుగారి ఆత్మ శాంతికొఱకు మౌన ప్రార్ధనలు జరిగెను. పలువురు పెద్దలు పటేలుగారి కార్యశూరతనుగూర్చి ఉపన్యసించిరి. మఱికొందరు పద్యములను పఠించిరి.

— యం. రంగారావు పట్నాయక్.

పశ్చిమ గోదావరిజిల్లా బోర్డుప్రెసిడెంటువారైన శ్రీ మాగంటి సీతారామదాసుగారి అధ్యక్షతను ది 2-12-50 తేదీని నరసాపురం గ్రామములో, నరసాపురం బోర్డు ఎలిమెంటరీ స్కూల్ టీచర్సు యూనియన్ అష్టమవార్షికోత్సవ మహాజనసభ జయప్రదముగ జరుపబడినది.

సదరు సమావేశములో, సానుభూతి తీర్మానములు, ఆం. ప్రా. ఉపాధ్యాయ పరిషత్తును, ప్రభుత్వముచే గుర్తింపు విషయము, తోటమాలి, సైటువాచర్ల నియామకముల, జిల్లాబోర్డు ఉపాధ్యాయులనియామకములు, వారివేతనాభివృద్ధి, సెలవులు, తదితర జీవనసౌకర్యములును, కరువుభత్యం వగైరా గురించి, పాఠశాలా భవనములరిపేరు, బోధనోపకరణములు స్టేషనరీ, సప్లయిలు, సైన్సు అపరేటసు, వగైరాల సప్లై గురించి, తీర్మానములున్నూ, తదితర తీర్మానములున్నూ, మొత్తం 25 తీర్మానములు గావింపబడినవి.

ది 6-1-51 తేదీన గుడివాడ రూరల్ వెస్టు టీచర్సు అసోసియేషన్ సమావేశము శ్రీ G. A. శేషగిరిరావుగారి అధ్యక్షతను గుడివాడ మున్సిపల్ గరల్సు పాఠశాలలో జరిగినది. సభకు శ్రీ గుడివాడ రేంజి డిప్యూటి యిన్‌స్పెక్టరుగారగు P. చిరంజీవిరావుగారుకూడ హాజరైరి.

ఈ క్రింది తీర్మానమును సమావేశములో ఏకగ్రీవముగా నామోదించిరి.

బోర్డు పాఠశాలలకు ఆవరేజి అటెండెన్సు టీచరుకి 30 చొ॥న చూపవలెనని మానేజిమెంటువారి యొద్దనుండి ఉత్తరువులు వచ్చియున్నవి. గాని ఆవరేజి అటెండెన్సు టీచరుకి 20 మందికంటె ఎక్కువ చూపుట చాలాకష్టమని ప్రాక్టికల్ ఎక్స్పీరియన్సువల్ల తెలియుచున్నది. అందువల్ల ఎయిడెడ్ పాఠశాలలలో యుంచిన పద్ధతినే అనగా టీచరుకి 20 ఆవరేజి అటెండెన్సు చొ॥న బోర్డు పాఠశాలలలో కూడ యుంచవలెనని శ్రీ ప్రభుత్వము వారిని యీసమావేశమువారు కోరుచూ యున్నారు.

జి. నరసయ్య.
సెక్రటరీ.

# కొవ్వాక సెంటరు వార్షికోత్సవము

ఏలూరు తాలూకా పెదఃడిమిబోర్డు ఎలిమెంటరీ స్కూలులో ది 20-12-50 తారీఖున శ్రీ వెస్టు రేంజిసీనియర్ డిప్యూటీ యినస్పెక్టరుగారగు కె. వెంకటేశ్వరావుగారి అధ్యక్షతను కొవ్వాక సెంటరుక్లాసు వార్షికోత్సవము జరుపబడెను. ప్రార్థనానంతరము సెక్రిటరీ రిపోర్టు చదువబడెను. అధ్యక్షోపన్యాసము లోని విద్యావశ్యకతను గురించి వివరించబడెను. తదుపరి సభాప్రారంభకులు జూనియరు డిప్యూటీ యినస్పెక్టరు గారగు శ్రీ వెంకటనారాయణగారు సభాప్రారంభము చేయుచూ తల్లిదండ్రులకు పాఠశాలలకు ఉండుసంబంధమును విపులీకరించిరి. తదుపరి పెదకడిమిబోర్డు టీచర్సు విద్యావిషయములను గురించి మాట్లాడిరి. అమ్మపాలెం హిందూ ఎయిడెడ్ స్కూలు బాలబాలికలచే షాజహాను డ్రామా, గొబ్బిపాటలు ప్రదర్శింపబడెను. పెదకడిమి బోర్డు స్కూలు బాలురచే "ఎప్పుడూ యింతే" అనుప్రహసనము ప్రదర్శింప బడెను. పెదకడిమి బోర్డు ఎలిమెంటరీ స్కూలు ప్రధానోపాధ్యాయుడు R పెంటయ్యగారిచే హరిశ్చంద్రలో కాటికాపరిసీను ప్రదర్శింపబడినది. శనివారప్పేట హిందూ ఎ. ఎలిమెంటరీ స్కూలు బాలురచే నెహ్రూజీవితము బుర్రకథ చెప్పబడెను. డాక్టరుగారిచే బాలబాలికలకు బహుమతులు పంచిపెట్టబడెను. సమావేశము "హ్వానాధ్యక్షుడు శ్రీ R. పెంటయ్యగారి కృతజ్ఞతాభివందనములతో సభ ముగించబడెను.

ఇట్లు, ఆహ్వానసంఘాధ్యక్షుడు.
ఆర్. పెంటయ్య, హెడ్ మాష్టరు,
బోర్డుఎలిమెంటరీస్కూలు, పెదకడిమి.

# వెదురుమూడి కేంద్రోపాధ్యాయసంఘ వార్షికోత్సవము

ది 19-12-50 న వెదురుమూడి కేంద్రోపాధ్యాయసంఘ వార్షికోత్సవము వెదురుమూడి హిందూ ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలలో శ్రీ ఆలమూరు రేంజిస్కూళ్ల సీనియరు డిప్యూటీ యినస్పెక్టరుగారైన D. జగన్నాథరాజు B. A., B. Ed., గారి ఆధిపత్యమున జరపడమైనది. సుమారు 100 మంది ఉపాధ్యాయులు హాజరైరి. శ్రీ చెముడుపాటి శ్రీరామచంద్రమూర్తి B. A., B. Ed., గారి బదిలీ సందర్భమున Dr. పెద్దింటి సూర్యనారాయణ మూర్తిగారిచే రచింపబడిన వీడ్కోలు పద్యరత్నములు చదువబడినవి. వెదురుమూడి హిందూ ఎయిడెడ్ పాఠశాల బాలిలచే "రవి" యను నాటకము ప్రదర్శింపబడినది. శ్రీ చెముడుపాటి శ్రీరామచంద్రమూర్తి B. A., B Ed., గారు ఉపాధ్యాయులకు తగు సలహాల నిచ్చిరి. వారిచే బాలబాలికలకు బహుమతు లొసంగబడెను. తదుపరి చాలమంది యుపాధ్యాయులు ఉపన్యసించిరి. అల్పాహార విందుతో సభ ముగియడమైనది.

ఇట్లు
డి. సుబ్బారావు.

# శ్రీ మదాంధ్ర మహాభారతము

(పద్యకావ్యము - కవిత్రయ ప్రణీతము)

పండిత పరిశోధితము (క్యాలికోబైండు)

| | | |
|---|---|---|
| విడి సంపుటము 1-కి | — | 4-0-0 |
| పూర్తి ప్రతి 7 సంపుటములలో | — | 28-0-0 |
| ,, 3 సంపుటములలో | — | 26-0-0 |

# శ్రీ మదాంధ్ర మహాభాగవతము

(పద్యకావ్యము - పోతనామాత్య ప్రణీతము)

పండిత పరిశోధితము (క్యాలికోబైండు)

| | | |
|---|---|---|
| సంపూర్ణ ప్రతి—ఒకే సంపుటము | — | 12-0-0 |
| ,, —రెండు సంపుటములు | — | 14-0-0 |
| ,, —మూడు సంపుటములు | — | 16-0-0 |

| | |
|---|---|
| **భర్తృహరి సుభాషితము** (క్యాలికో బైండు) | 4-0-0 |
| **శ్రీకృష్ణ కర్ణామృతము** (క్యాలికో బైండు) | 3-0-0 |
| **శ్రీరామ కర్ణామృతము** (క్యాలికో బైండు) | 2-8-0 |

# శ్రీ మద్భగవద్గీత (పండిత పరిశోధితం)

| | | |
|---|---|---|
| ఆంధ్ర తాత్పర్యసహితము క్యాలికోబైండు | — | 2-0-0 |
| ,, రేపరుబైండు | — | 1-8-0 |
| మూలం రేపరు | — | 0-6-0 |
| ఆంధ్ర వచనము చిన్నసైజు | — | 0-8-0 |

**భాస్కరరామాయణము** - పద్యకావ్యం

(అచ్చులోనున్నది)

ప్రకాశకులు:

రామా అండ్ కో., (H. O) ఏలూరు.

బ్రాంచిలు : గుంటూరు - రాజమండ్రి - భీమవరము - తెనాలి - విజయనగరము

Edited by Sri M. Venkata Ratnam Garu, B.A., & Printed and Published by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru.

# స్కూళ్లకు పనికివచ్చు
# క్రొత్త నమోనా ఫారములు

(మదరాసు డైరెక్టరువారి ప్రొసీడింగ్సులో
క్రొత్తగామారిన రూల్సుప్రకారం
తయారుచేయబడినవి)

జెలసరి లెక్క (మంత్లీ రిటరను)

| | | |
|---|---|---|
| ఫారములు | 100-కి | 2- 0-0 |
| డిఫాల్టర లిస్టు | ,, | 1- 0-0 |
| అడ్మిషన్ దరఖాస్తులు | ,, | 1- 0-0 |
| రికార్డుషీటు | ,, | 1-12-0 |
| స్టాగ్నేషను లిస్టు | ,, | 1-12-0 |

వలయువారు :—

## రామా అండ్ కో.,

ఏలూరు - గుంటూరు - రాజమండ్రి -
భీమవరం - తెనాలి - విజయనగరం.

# శ్రీ మోక్షగుండరామాయణము

## యక్షగానము (హరికథ)

(ఆరుకాండలుగల సంపూర్ణరామాయణము)

శ్రీ తాళ్ళూరి నారాయణ సత్కవి విరచితము

ఈ గ్రంథమింత స్వల్పకాలములోననే తొమ్మిది ముద్రణములు చేయబడి వేల ప్రతులు అమ్మబడియుండుటచే దీని ప్రాశస్త్యము సందర్శనము. పద్యములు పాటలు, కీర్తనలు, దరువులు, శ్లోకములు అతి మనోహరములు. ప్రతివారును చదివి ఆనందింపదగినది. హరికథకులకు స్త్రీ పురుషులకు మిగుల ఉపయోగము.

**క్యాలికో బైండు వెల రు. 3-8-0**

# అష్టాదశ పురాణసారము

(18 పురాణములు నాల్గుభాగములలో ముద్రించబడినవి.)

వేమూరి జగన్నాథశర్మ విరచితము

ఇహపరసాధనకు 18 పురాణముల విశేషములను ప్రతివ్యక్తియు తెలుసుకొనుట ఎంత ముఖ్య అవసరమో అందరికిని తెలిసిన విషయమే. అట్టి పురాణములు సంస్కృతభాషయందుండుటచేత అందరును చదివి ఆనందించుటకు వీలు కలుగుటలేదు. ఆకొరతను తీర్చుటకు మేము పురాణముల నన్నిటిని సంగ్రహముగా నెన్నడు కని విని యెరుగని కథలను సులభశైలిని రసముప్పతిల్లునట్లు ఆబాలగోపాలము చదివి యానందించునట్లు వ్రాయించి ప్రచురించియున్నాము. కొద్దికాలముననే అనేక వేల ప్రతులు అమ్మబడియున్నవి.

**విడిప్రతి 1 కి సాదాబైండు వెల : 1-4-0.**

**4 భాగములు కలిసిన క్యాలికో బైండు వెల : 5-8-0.**

ప్రకాశకులు :

## రామా అండ్ కో., (H. O.) ఏలూరు.

బ్రాంచీలు : గుంటూరు – రాజమండ్రి – భీమవరము – తెనాలి – విజయనగరము